# రాగరాగిణి

నాటకం

గొల్లపూడి మారుతీరావు

నవోదయ పబ్లిషర్సు
విజయవాడ-2

మనస్సుకు దగ్గరపడిన
మంచి నేస్తం
మా
వెంకటేశ్వరరావుకు
ప్రేమతో
గొల్లపూడి మారుతీరావు

## నా కృతజ్ఞతలు

ప్రఖ్యాత నాటకకర్త యూజీనీఓనీల్ వ్రాసిన 'బియాండ్ ది హొరైజన్' (Beyond the Horizon) అన్న నాటకం దీనికి ఆధారం. పాత్రలూ, సన్నివేశాలూ స్వతంత్రించి కల్పించు కొన్నవి.

ఈ రచనకు అనుకూలంగా తోడ్పడిన
మిత్రుడు కె. వెంకటేశ్వరరావుకూ,
ఆయన సతీమణి శ్రీమతి శారదగారికీ —

రూపం కల్పించుకొన్న నా నాటకానికి ప్రాణం పోసిన
ర. స. న. సమాఖ్య (విజయవాడ) కూ —

ప్రత్యేక ఆకర్షణలతో ముద్రణకు పూనుకొన్న
శ్రీ రామమోహనరావుగారికీ, నవోదయ పబ్లిషర్సుకూ —

ఈ నాటకం ప్రదర్శన హక్కులు మాత్రం ర. స. న. సమాఖ్య (విజయవాడ) కు యిస్తున్నాను.

— రచయిత

## నాటకం తులనాత్మక శక్తి

రచనలోనూ, పాత్రీకరణలోనూ, సంవిధానంలోనూ ప్రయోగాత్మక దృక్పథంలో జరిగిన సృష్టి 'రాగరాగిణి'. ఒక మంచి ప్రయోగానికి విజయమే అంతిమ లక్ష్యం కాదు. ప్రయోగఫలితం 'విజయవంతం' కాకపోయినా, ప్రయోగం విజయవంతంగా ముగిస్తే చాలును. ఆ విధంగా ర. స. న. సమాఖ్య సమర్థ నిర్వహణలో 'రాగరాగిణి' అన్నివిధాలా విజయం పొందిందనే చెప్పాలి.

ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీలకు యిది అనర్హమైనదిగా పరిగణింపబడింది. విజయానికి అది మొదటి మెట్టు. తర్వాత ఢిల్లీలో అఖిలభారత నాటక ప్రదర్శనలలో ఉపరాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ ముందు ర. స. న సమాఖ్య ప్రదర్శించి పలువురి ప్రశంసలు పొందింది. దీనిలో 'కన్నా' పాత్ర ధరించిన చిరంజీవి కె. వి. హనుమంతరావుకు అఖిలభారత ద్వితీయ ఉత్తమ బాలనటుడిగా బహుమతి లభించింది అదొక ఘనవిజయం. తరువాత విశాఖలో 'సాంస్కృతిక వారోత్సవాలలో' మంచి ప్రదర్శన యిచ్చారు. తదుపరి ప్రఖ్యాత దర్శక నిర్మాత శ్రీ బి. యన్ రెడ్డిగారి సమక్షాన, ప్రదర్శన జరిగినప్పుడు ప్రత్యేక ప్రశంసలందాయి. ఇన్ని ప్రదర్శనలలోనూ రచనా వైవిధ్యం విషయమై కొన్ని సాంఘిక మర్యాదలకు విభిన్నంగా, పాత్రీకరణలో నవ్యతకై కొత్తపుంతలు తొక్కిన తీరు—ఎంతమందిలో సంతృప్తిని కలిగించిందో, అంతమందిలో అసంతృప్తినీ కలిగించింది. ఢిల్లీ పత్రికలు ఒక పక్క యీ నాటకాన్ని 'ఆంధ్రలో కొత్త ప్రయోగం'గా ప్రశంసిస్తూనే, తమ భేదాభిప్రాయాలనూ వ్యక్తం చేశాయి — అందుకే 'రాగరాగిణి' ఉత్తమ రచన అయింది.

మాకు యీ ప్రచురణావకాశం కలిగించిన మిత్రులు మారుతీరావుగారికీ, ఈ నాటకానికి తగినంత ఖ్యాతిని ఆర్జించిపెట్టిన ర. స. న. సమాఖ్యకూ కృతజ్ఞులం.

నటకులు, సహృదయులు మా యీ ప్రయత్నాన్ని విజయవంతం చేస్తారన్న ఆశ వుంది.

—ప్రచురణ కర్తలు

# అభిప్రాయాలు

—ఆంధ్రప్రభ (డైలీ) 14-2-60

శ్రీ గొల్లపూడి మారుతీరావు రచించిన 'రాగరాగిణి' ఒక జీవితం. నవరస భరితం. వాస్తవికత దాని శిల్పం. మధురమైన మృగతృష్ణకు ఒక అభిజ్ఞ 'రాగ రాగిణి'....

బాక్సాఫీసు బంధనాలకో తెలుగు సినిమాలలాగా, తెలుగు నాటకాలు సంకు చితంగా మూసలో పోసినవిధంగా, ఉత్పత్తి అవుతున్న యీకాలంలో 'రాగరాగిణి' ఒక విప్లవం. సినిమారంగంలో సత్యజిత్‌రాయ్ తెచ్చినంత విప్లవం, తెలుగు నాటక రంగంలో యీ నాటకం తీసుకురాగలదు. అధివాస్తవికత యీ నాటక ప్రత్యే కత. నాటకం ప్రత్యంగుళం సహజంగా, హాయిగా వుంది ...

పాత్రల చిత్రీకరణ విషయంలో, రఘు పాత్ర తెలుగు నాటకరంగంలోనే అపూర్వం అనిపించే విధంగా వుంది. రచయిత హృదయంలో కొండంత వేదనా, సముద్రమంత వాంఛా లేనిదే యింత గొప్పపాత్రను యింత సహజంగా సృష్టించ లేడు. ఇంకా రాధ, శేషు, పరంధామయ్య, పతి—ఒక్కొక్క పాత్ర ఒక్కొక్క ప్రయోగం ఒక్కొక్క సాహసం....

........అయితే నేటి సగటు తెలుగు నాటకాలలోవలె, ఆంగ్లనాటక వాతావర ణం వెతికినా కనుపించదు. ఆంగ్లనాటక ప్రభావాన్ని ఇంత చక్కగా అచ్చతెలుగు సంప్రదాయం లోనికి మలుచుకోగలిగిన వారు 'దాదాపు లేరు' అంటే అతిశయోక్తి కాదు. తెలుగు సంప్రదాయంలోని మాధుర్యమంతా యీ నాటకంలో వుంది. ఆ పాత్రలు మనకెంతో సన్నిహితంగా వచ్చి, తమ బాధనంతా మనతో చెప్పు కుంటాయి. మన ఓదార్పు కోరుతాయి. మనమీద ఆప్యాయత కురిపిస్తాయి.

* * *

—ఆంధ్రజ్యోతి—12-10-1960

....రెండు విభిన్న మనస్తత్వాలు కలిగిన స్త్రీ పురుషుల కలయిక వల్ల, అమృత కలశం కావలసిన దాంపత్యం, విషభాండంగా మారుతుంది. ఇదే ఈ నాట కంలోని ఇతివృత్తం. రచన రమ్యంగా సాగింది దీనిని రచించినవారు శ్రీ మారుతీరావు. దర్శకుడు శ్రీ కె. వెంకటేశ్వరరావు ప్రతిభ అడుగడుగునా కన్పించింది.

* * *

బి. యన్. రెడ్డి
నిర్మాత, దర్శకుడు - వాహిని ప్రొడక్షన్స్
9 — 2 — 60

....ర. స. న. సమాఖ్యవారి 'రాగరాగిణి' నాటకం చూశాను. చాలా కాలానికి ఒక మంచి నాటకం చూశాను. నాటకనిర్మాతలు, నటీనటులు ఎంతైనా ప్రశంసనీయులు. ఈలాంటి కళాకారుల తపస్సు ఆంధ్రదేశంలో సజీవ నాటకరంగాన్ని తీసుకొస్తుందని ఆశిస్తున్నాను.

* * *

కె. వి. యస్. శర్మ
సినీ నటుడు
10 — 10 — 60

....ర. స. న. సమాఖ్యవారి 'రాగరాగిణి' చూసే అదృష్టం కలిగింది. అదొక అపూర్వ కళాఖండం. విభిన్న ప్రవృతులు, విరుద్ధ మనస్తత్వాలు కల యువతీ యువకుల దాంపత్య జీవితం, ఎంతటి విపరీత, విపత్కర పరిస్థితులకు దారి తీస్తుందో, జీవితంలో రాజీ పడలేక, పోరాడలేక సిద్ధాంతానికీ, అనుభవానికీ మధ్య నలిగిపోయి ఆత్మ బలిదానం చేసుకున్న అసమర్థుడి జీవితగాథ, ఎంతటి హృదయ విదారకమో, కళాత్మకంగా చూపించారు ర.స.న. సమాఖ్యవారు. చక్కటి వినోదం, చక్కటి విషాదం ప్రతిసన్నివేశంలోనూ సహజత్వం తొణికిసలాడింది. 'రాగ రాగిణి' ఒక అమరకావ్యం-కళామతల్లికి కమనీరాజనం- ఆంధ్రులకు గర్వకారణం.

* * *

—*The Statesman.* 17-12-59

......... The production, by K. Venkateswara Rao was unadorned and simply dressed It showed an awareness of the relentless central situation.

* * *

—*Times of India.* 17-12-59

The adaptation of Eugene O'neill's "BEYOND THE HORIZON" which this play turned out to be, has been done by Gollapudi Maruthirao with a measure of fidelity. The basic story of the frustration and failure of an impractical young man, floating on the clouds of dream, has been retained. A couple of characters, not in the original, have been introduced. The melodramatic moments have been heightened, and the tragedy has been served with a good deal of humour, presumably, as a concession to the average Indian taste

* * *

—*Indian Express, Sunday Standard* 27-12-59

.........Somehow one had associated the Southern Indian theatre with the theatricality of a bygone age, of heroic postures and violent upheavals. There was, instead, a curbing of theatricality and an attempt at character portrayals. Human weaknesses were treated sympathetically, and abstract, text-book virtue was not held up as exemplary. This was more marked in the case of "Raaga Raagini". It is very rare for a South Indian playwright to attempt to treat the subject of marital disharmony, bordering on infidelity though this was incidental to the main theme with understanding, without crying fire and brimstone.

* * *

ర. స. న. సమాఖ్య, (విజయవాడ) వారి ఆధ్వర్యంలో ఢిల్లీ, విశాఖపట్టణం కాకినాడ, విజయవాడ మొదలయిన ప్రముఖ నగరాల్లో జరిగిన ప్రదర్శనాల్లో పాల్గొన్న నటవర్గం.

రఘు:—A. శివరామరెడ్డి, K. వెంకటేశ్వరరావు

శేషు:—Ch. కృష్ణమూర్తి

(నీలూ) కన్నా:—K V. హనుమంతరావు

రాధ:—B. బాలసరస్వతి, Ch. వాణీబాల

పతి:—వెంకటేశ్వరరావు, P రామచంద్రరావు

కేశవరావు:—N. వాసుదేవరావు

లలిత:—K. సరోజినీదేవి, అన్నపూర్ణ

పరంధామయ్య:—G. S. R. మూర్తి

రంగయ్య:—S. వెంకటేశ్వరరావు

డాక్టరు:— K. K నాయుడు, N. వాసుదేవరావు, M S. R. శాస్త్రి

దర్శకత్వం : కె. వెంకటేశ్వరరావు

సంగీతం : కనగిశెట్టి రాధాకృష్ణ, వెంకటేశ్వరరావు, చార్లెస్, హస్సన్

నేపథ్యగానం : కుమారి రమణ, కుమారి దినమణి

నిర్వహణ : G S. R. మూర్తి, K. రామకృష్ణ



## ఇందలి పాత్రలు

| | | |
|---|---|---|
| రఘు | .... | కథానాయకుడు |
| శేషు | .... | రఘు అన్న |
| రాధ | .... | రఘు భార్య |
| (నీలూ) కన్నా | .... | రఘు తమ్ముడు |
| కేశవరావు | .... | రఘు తండ్రి |
| లలిత | .... | రఘు తల్లి |
| పతి | .... | రఘు మేనమామ |
| పరంధామయ్య | .... | రఘు మామ (రాధ తండ్రి) |
| డాక్టర్ | .... | |
| రంగయ్య | .... | రఘు పొలంలో రైతు |



# మొదటి రంగం

మధ్యతరగతి కుటుంబీకుల యింటిలో ముందు చపటా. పట్నవాసపు పోకడలేవీ యింకా ఆకుటుంబంలో పూర్తిగా ప్రవేశించలేదు. అలాగని పల్లె వాతావరణమూ పూర్తిగా కన్పించడంలేదు. ప్రేక్షకులకు ఎదురుగ్గా కుడి వేపు పొలంపనికి ఉపయోగించే పనిముట్లూ; క్రరలూ - ఎడమవేపు టేబిలు మీద పుస్తకాలూ, ముందుకుర్చీ చూస్తే-ఆ కుటుంబపు సంస్కారం కొస్త అర్థమవుతుంది. కొంతమంది మనస్సులు సంస్కారం వేపు మొగ్గితే, యింకా మరికొందరి మనస్సులు పల్లెవాతావరణాన్ని పట్టుకునే పాకుతున్నాయి. ఆ కుటుంబంలో అది సందిగ్ధ పరిస్థితి. ఎదురుగ్గా (మధ్యకి) వీధిలోనికి దారి. ఎడమవేపు టేబిలుమీదుగా కిటికీలోంచి దూరాన నీలి ఆకాశం కన్పిస్తుంది. టేబిలు పక్కనే(ఎడమవేపు) పడకగదిలోకి త్రోవ మరికొస్త క్రిందికి వంటయింటిలోకి ద్వారం ఉంది.

అలాగే కుడివేపు (మీదుగా) పెరట్లోకి, తోటలోకి త్రోవ, క్రిందుగా కుటుంబయజమాని గదిద్వారం ఉన్నాయి. కుడివేపు ముందుస్టేజీ (apron)లో పక్కగా అద్దం ఉంది గోడకుఆనించి. అక్కడే క్రింద ఒక కుర్చీఉంది. కుడివేపు రెండు గుమ్మాలమధ్య గోడకుఆనించి మంచంఉంది.

రంగస్థలానికి కుడివేపు మామూలు కుర్చీ, ఎడమవేపు ముందుకూ, వెనుకకూ ఊగిసలాడే కుర్చీ ఉంది. రఘు చివరివరకూ అదే కుర్చీలో కూర్చుంటాడు.

మే నెలలో ఒకనాటి ఉదయం. సుమారు ఆరున్నర. అప్పుడే సూర్యోదయమయి అయిదారు నిముషాలయింది. ఎదురుగ్గా కనిపించే నీలి మాకాశం అరుణిమ యింకా యింకిపోలేదు. రెండుమూడు ఎరుపుచారలు తూర్పు ఆకాశం మీద కన్పిస్తున్నాయి. ఎర్రటి మట్టికొండలు సూర్యుడి వెలుగుల్లో గాజుపలకల్లా మెరుస్తూ కన్పిస్తున్నాయి.

తెరలేవగానే రఘు కిటికీదగ్గరఉన్న బల్లమీదకూచొని పుస్తకం చదువుకొంటూ, మధ్యమధ్య దూరపు ఆకాశాన్ని పరికిస్తున్నాడు. సన్నగా పీలగా, బలహీనంగా వుంటాడు. కళ్ళలో సౌమ్యత, మాటలో బరువు, కదలికలో ఆలోచన – అతని వ్యక్తిత్వానికి ఏదో విశిష్టతను విస్మయం కలిగిస్తుంది. అలా నిశ్చలంగా, నిర్లిప్తంగా అటువేపు చూస్తూ కూచొన్నాడు రఘు.

ఇంతలో శేషూ (రఘూకంటె పెద్దవాడు) ముఖం తుడుచుకొంటూ వచ్చాడు. ఆ వెనకనే కన్నా (నీలూ) మారాంచేస్తూ వచ్చాడు. నీలూ అందర్లోకీ చిన్నవాడు. మాటలురావు, మూగవాడు. అందుకని అతనితో మాట్లాడేటప్పుడు అంతా మాటలకంటె, సంజ్ఞలే ఎక్కువగా ఉపయోగిస్తారు.

ఇప్పుడే నీలూ అన్నయ్యని ఎందుకో వేధిస్తున్నట్టున్నాడు. శేషూ విసుగుపడుతున్నాడు...

శేషు : తెస్తానన్నానుకదరా ?— తెస్తానులేరా... సాయంకాలం తప్పకుండా తెస్తాను. (ఇంకా గునుస్తున్నాడు ) మరి అల్లరిచేస్తే నాకోపంకన్నా — సాయంకాలం పె...ద్ద మోపు తీసుకొస్తాను. సరా ?—

(ఈలోగా వీధిగుమ్మంలోంచి రాధ వచ్చింది. నీలిరంగు పరికిణా మీద కెంపుపావడా వేసుకుంది. మనిషినడక నిర్లక్ష్యం, మాటలో విసురూ, కళ్ళల్లో చపలత్వం, నవ్వులో అందం— ఏదో విచిత్రమైన శిల్పంలాగా వస్తూనే వీళ్ళిద్దరి తగాదాచూసి నవ్వుకు ఆగిపోయింది. ద్వారానికి చేరబడి నిలబడింది.)

రాధ : ఏమిటి బావా అది ?

శేషు : అబ్బో ! తోలుబొమ్మ వచ్చిందిరోయ్. ఏం రాధీ ! పొద్దులే యిలావచ్చావ్ ? చూడు రాధీ వీడు ?

రాధ : ఏమంటాడు ?

శేషు : ఏముంది? చెరుకుగడలు. నువ్వు నేర్పి ఒదిలిపెట్టావు. నన్ను చంపుతున్నాడు.

రాధ : నేను నేర్పానా ?

శేషు : నువ్వు కాదూ ? (చెవి పట్టుకోబోయాడు)

రాధ : (తప్పించుకుని) అవున్నేనే — అవునూ చిన్నపిల్లలు అడిగితే తప్పా ఏమిటి ?

శేషు : వాడు సరే—నువ్వింకా చిన్నపిల్లవా ఏమిటి ? పెళ్ళయితే యీపాటికి యిద్దరూ —ఓకొడుకు ఓకూతురూ. (రాధ పారిపోబోతే) అహహా ! అనన్లేవే — (ఆగుతుంది. కాస్సేపయాక మెల్లగా) అయితే రాధీ !

రాధ : (కోపంగా) ఊఁ ?

శేషు : ఇంత కోపంవుంటే నిన్నెవరూ పెళ్ళిచేసుకోరు రాధీ. చెప్తున్నాను. నామట్టుకు నేను, మావయ్య బలవంతం పెట్టినా ...

రాధ : ఏడుస్తా నలాగయితే.

శేషు : అదొక్కటే తెలుసు నీకు — ఆ పొగాకుకాడ అందుకో. (వెళ్ళి తెచ్చియిచ్చింది. మంచంవాల్చుకు స్థిమితంగా కూచుని కాడ చీలుస్తున్నాడు శేషు. రాధ ఏదో అడగబోయి తటపటాయించి, అంతలో స్థిమితపడి మధ్య గుమ్మానికి చేరబడి ఎటువేపోచూస్తూ మాటలు జార్చింది.)

రాధ : బావా ! ఒక్కటి అడిగేదా ?

శేషు : (విసురుగా) ఏమిటది ? అంతరహస్యం ?

రాధ : ఉష్ ! మెల్లిగా — వింటాడు (కిటికీదగ్గరకూర్చొని చదువుకుంటున్న రఘును ఉద్దేశించి అంది.)

శేషు : ఏమిటి చెప్పు ?

రాధ : బావ వెళ్ళడం నిజమేనా ?

శేషు : ఎవరు ? చిన్నా సంగతా ?

రాధ : లేకపోతే నువ్వేమిటి ?

శేషు : ఎక్కడికి వెళ్ళడం ?

రాధ : అదే— బాబాయితో

శేషు : ఏమో— వాడ్నే అడుగు.

రాధ : నువ్వు చెప్పకూడదా యేమిటి ?

శేషు : (కళ్ళల్లోకి చూసి) మావయ్యతో నువ్వుకూడా వెళ్ళకూడదూ ? దొరసాన్నిచేసి తెస్తాడు.

రాధ : పోబావా, నువ్వు ఎప్పుడూ తిన్నగా మాట్లాడవు. (లేచి) అత్తయ్య ఎక్కడుంది ?

శేషు : నా జేబులో వుంది.

రాధ : అదిగో మళ్ళీ.

శేషు : (నవ్వి) బజారు వెళ్ళిందే. తమ్ముడు రేపు వెడుతున్నాడుకదూ, వాడికొక్కావల్సినవన్నీ కొనుక్కురావడానికి హడావిడి చేస్తోంది.

రాధ : మరి మావయ్య ?

శేషు : సరి, నాన్న లేకపోతే కథేలేదు. ఇద్దరూ వెళ్ళారు బజారుకి.

రాధ : సరిపోయింది, మావయ్యాని పిలుచుకురమ్మని నాన్న చెబితే వొచ్చాను. నే పోతాబాబు (వెళ్ళిపోబోతే, గభాలున శేషు రాధ జడపట్టుకొని)

శేషు : ఇదిగో రాధీ !

రాధ : (విదిలించుకొంటూ) అబ్బ! ఏమిటి బావా అది ?

శేషు : అబ్బో! సిగ్గుపడడం కూడా తెలుసే నీకు. నేను పొలం వెళ్ళాలి, అన్నం మూటకట్టి వెళ్ళు.

రాధ : (వెక్కిరింపుగా) ఆ !

శేషు : పొలంవెళ్ళేప్పుడు అలా యింటివైపు వస్తాను; దోసెలు చేసివుంచు.

రాధ : అబ్బ ! ఆశ ! నేను కట్టనుబాబు. ఇంకా సింగడ్ని పాలు తెమ్మని చెప్పాలి.

శేషు : అదిగో! అలావేషం వేస్తేనే చెవి మెలేస్తాను. ముందు నే చెప్పినట్టుచెయ్యి.

రాధ : నే చెయ్యాను.

శేషు : చెయ్యవ్ ? ఒరే కన్నా (చెవిపట్టుకొని మేకను లాక్కొచ్చినట్టు లాక్కుపోతూ) ఆ తాడందుకోరా దీన్నా స్తంభానికి కట్టేస్తాను.

రాధ : అబ్బ, నీకు నమస్కారం చేస్తాను. నన్ను వొదిలెయ్ బావా.

శేషు : అన్నం కడతావా మరి ?

రాధ : పనుంది వెళ్లాలి. (appealingly)

శేషు : అలాగే వెళ్దువుగానిలే. ఒరేయి తాడందుకోరా... నాటకాలేం పనికిరావు రాధీ— చేస్తావా—యీచెవి (రెండో చెవి పట్టుకుంటాడు)

రాధ : అహా! చేస్తాను.

శేషు : అదీవరస (వదిలేస్తాడు)

రాధ : పో— నీ దెప్పుడూ మోటతనమే. ఈసారి నీ పొలానికి రాను.

శేషు : అలాగా (కన్నాతో) ఒరే కన్నా! బాదంకాయలు ఇన్ని కోసుంచాను...

రాధ : (ఉత్సుకతతో) ఎప్పుడు బావా? మధ్యాహ్నం వొచ్చేదా?

శేషు : నువ్వు రానన్నావుగా?

రాధ : పో బావా! ఉండు అన్నం కట్టితెస్తాను. (రాధ వంటింట్లోకి వెళ్ళింది)

శేషు : (నవ్వి వెనక్కితిరిగేసరికి మొదటినుంచి కిటికీదగ్గర పరధ్యానంలో వున్న తమ్ముడు కనిపిస్తాడు.) అయితే చిన్నా! మొదట ఇక్కణ్ణుంచి ఎక్కడకు వెడతార్రా? (రఘూ మాట్లాడడు) ఒరే చిన్నా!... వారేవా! కళ్ళువిప్పి నిద్రపోయేవాణ్ణి నిన్నే చూశానురా... (గట్టిగా) ఒరే చిన్నా...

రఘు : (తుళ్ళిపడి) ఏం అన్నయ్యా!

శేషు : మేలుకునే వున్నావురా?

రఘు : ఏదో ఆలోచిస్తున్నాను.

శేషు : నువ్వా ఆలోచించనిది యెప్పుడులే; అయితే రేపు వెళ్ళడం రూఢేనా ?

రఘు : ఎక్కడికి ?

శేషు : అదే, మావయ్యతో.

రఘు : వెళ్ళాలన్నయ్యా.

శేషు : వెడితే మంచిదే కాని... నామటుకు నువ్వు వెళ్ళడం ఏమీా నచ్చలేదురా. అహఁ, నాకు యిష్టం లేదను కోకు. వెధవ డబ్బుకోసం అంతదూరం వెళ్ళక పోతేనేం చెప్పు. కన్నా మూగవాడా? ఇక నువ్వు పోతే మాకేం తోచదు. నాకు చెయ్యి విరుచుకున్న ట్టుంటుంది. అమ్మకూడా దిగులుపడుతుంది. ఆలో చించు నువ్వే ?

రఘు : (కంఠంలో బరువు) ఎంతకాలం యిలా కూచోను అన్నయ్యా ? ఏదో వొకటి చెయ్యాలిగా! పైగా అన్నీ చూడాలన్న వుత్సాహం— ఆ కొండల వెనుక ... ...

శేషు : సరి! సరి! అవన్నీ పాతకథలే, నేను వినంది యెప్పుడు? తాతలనాటినుంచి వున్నాయి ఆకొండలూ చెట్లూను. అంతమాత్రాన యిలా పిచ్చెక్కి తల బద్దలు కొట్టు కుంటామా ?

రఘు : నీ కిదంతా చెప్పినా అర్థంకా దన్నయ్యా ! అనుభ వించాలి. అందరిలాగా బ్రతకాలని తోచదు నాకు. అందుకనే క్రిందటిసంవత్సరం పట్నం వెళ్ళమని

నువ్వు బలవంతంచేసినా వెళ్ళలేదు. చదువులో ఉపాధి కావాలి వాళ్ళకి, నాకు చదువులో ఆనందం కావాలి. (మాటలమధ్య రాధ మెల్లగా పారిపోబోతుంది.)

శేషు : (కనిపెట్టి బుజం పట్టుకుంటాడు) రాధా ! పారిపోతున్నావా దొంగా !

రాధ : ఎక్కడ దేవస్తువులున్నాయో నాకు తెలీదు బావా, నన్నొదిలెయ్యి.

శేషు : (రఘుతో) ఒరే ! దీన్నెవడు పెళ్ళిచేసుకుంటాడో గాని మూడురోజుల్లో వాడినెత్తిన టోపీపెట్టి పారిపోతుంది- (రాధతో) ఆ చేతిలోది ఏమిటే ?

రాధ : సన్నజాజులు కోసుకున్నాను.

శేషు : అలా చెప్పు—అత్తయ్యమీద ప్రేమా కాదు, బావమీదా కాదు—సన్నజాజులు కోసం వచ్చిం దీవిడగారు. (కన్నా వెనకనుండి పువ్వుల పొట్లాన్నిలాక్కుని అన్నకు ఎగరేస్తాడు)

రాధ : పువ్వులిచ్చెయి బావా ?

శేషు : అబ్బ ! ఆశ ! మొదట నా అన్నం మూటకట్టు.

రాధ : నేను కట్టను.

శేషు : అయితే పువ్వులివ్వను పో.

రాధ : (రఘుతో) చూడు బావా ? (రఘు నవ్వుతాడు)

శేషు : సరి—వాడికి నీకంటె హెచ్చుసిగ్గు. పులివెళ్ళి పిల్లిని శరణు వేడిందట.

రాధ : (చిక్కులోపడి) సరే కట్టి తెస్తాను పువ్వులిచ్చెయ్!

శేషు : అమ్మో ! నిన్ను నమ్మమని ఎవరుచెప్పారు? పెరటి తోవను తుర్రుమంటావు. తీసుకురా ముందు.

రాధ : ఛీ ! నువ్వెప్పుడూ యింతే. (వంటగదిలోకి వెళు తుంది)

శేషు : (నవ్వి) దీని మొహంమీద నవ్వు బాగుంటుంది కదూ... అది సరే; ఏమిటి చెబుతున్నాను ? (గుర్తు తెచ్చుకుని) ఎన్నాళ్ళలో తిరిగి వొస్తానన్నాడు మావయ్య.

రఘు : మూడేళ్ళు.

శేషు : అబ్బ ! మూడేళ్ళే ?— పోనీ వెళ్తే వెళ్ళావుగాని ఒకటి రెండు నెలలుండి తిరిగి వచ్చెయ్ రా.

రఘు : అదెలా అన్నయ్యా ? రెండు నెలలకు సరిగ్గా సముద్రం మధ్యలో వుంటాం. అప్పట్లో రావడం పడదు సరి కదా, అలా వచ్చేడం కంటె అసలు వెళ్ళకపోవడం మంచిది.

శేషు : (నవ్వుకుని) అదీనిజమేలే (తమ్ముడు వెళ్ళడంలో మరో ఉపయోగం హఠాత్తుగా తట్టింది. ఉత్సాహం కూడదీసుకుని) ఛ ! యీ వెర్రికేంగాని, నీకంత సరదాగావుంటే వెళ్లిరా. రెండుచేతులా డబ్బు సంపా దించవచ్చు. కాని ఆలోచించు వొక్కసారి. నువ్వు వెళ్ళిపోతే అందరూ బెంగపెట్టుకుంటారు. ముఖ్యంగా అమ్మ— (తమ్ముడు ఎంతకీ జవాబు చెప్పకపోవడం

చూసి నిస్పృహుడై) సరే నేను ఇక పొలానికి వెళ్ళాలి. వెళ్దామనుకుంటె ప్రయత్నాల్ని కానియ్. ఆగిపోతే బాధేలేదు. (బయటకు వెళ్ళబోతూ చేతిలో పువ్వులమూటను చూసుకుని) రాధీ! ఒసేవ్ కోతీ! పువ్వులు పారేస్తున్నాను.

రాధ : (లోపలనుండి) పారేయకు బావా వస్తున్నానూ (పరుగున వొస్తుంది)

శేషు : (అన్నంమూట తీసుకుని తలమీద మొట్టి) భలే! దీనికి మంచి మొగుడు వొస్తాడు. (వెళ్ళిపోతుంటాడు— కన్నా చెరకుగడలకోసం అడ్డుతగిలి మారాం చేస్తాడు) తెస్తాలేరా— ఒకమోపు మోసుకొస్తాను సరా? (రఘుతో) ఒరేయ్ యీ కన్నాగాడికిచదువు చెప్పరా, అల్లరితో చంపేస్తున్నాడు. పోరా, పోయి చదువుకో పో.

రఘు : ఒరేయ్ కన్నా! ఇలారా. (వచ్చాడు) చదువుతావా? అన్నయ్యతో పొలంలో పనిచేస్తావా? (సంజ్ఞలతో అడుగుతాడు)

కన్నా : (చదువుతాను అని సంజ్ఞచేస్తాడు)

రఘు : అయితే పలక తీసుకురా.

కన్నా : (తెచ్చాడు)

రఘు : వ్రాయి. (ఏదో వ్రాసి చూపించాడు. చదివి) "నువ్వూ వూరువెళ్ళకు." హారి! ఇదెవరు చెప్పార్రా నీకు?

(మళ్ళా ఏదో వ్రాశాడు) "రాధ" ...నన్నువూరుకి వెళ్ళొద్దని చెప్పమందా !

కన్నా : (తలూపాడు)

రఘు : (సాలోచనగా) సరే వెళ్లు (అప్పటికే రాధ వచ్చింది)

(కన్నా వెళ్ళాక చిన్న విరామం. రఘు కిటికీదగ్గర ఆగుతాడు.)

రాధ : (మెల్లగా) అయితే బావా! రేపు నువ్వు వెళ్ళడం నిజమేనా ఏమిటి ?

రఘు : (పరధ్యానంగావున్న రఘు తేరుకుని) నువ్వా రాధా ? వెళ్ళాలా ?

రాధ : నేనడిగింది చెప్పుమరి ?

రఘు : వెళ్ళాలి (అంటూ తన గదిలోకి వెళ్ళబోతాడు)

రాధ : బావా!

రఘు : (వెనక్కి—తిరిగి ఆగాడు ముఖంచూస్తూ)

రాధ : (కళ్లుదించుకుని) ఎందుకు వచ్చానో అడక్కూ—డదా యేమిటి ?

రఘు : నీ వాళ్ళో పువ్వులే చెబుతున్నాయిగా ?

రాధ : అబ్బో తెలివి ? అంతేనన్న మాట.

రఘు : కన్నా కోసమా ?

రాధ : ఇంకా నయం — మీ ఆవుని చూసిపోవడానికి అన్నావు కాదు.

రఘు : మరి ?

రాధ : నీతో ఆకాశాన్ని చూస్తూ కలలుకనడానికి కాదు.

రఘు : (ఏంమాట్లాడకుండా తన రూములోకి వెళ్ళబోతాడు)

రాధ : (నవ్వి) కోపంవచ్చిందా? (పువ్వులు చెండుకడుతోంది)

రఘు : నీమీద నాకెందుకు కోపం?

రాధ : మరలా పారిపోతావేం ?

రఘు : నేను పారిపోయానా ?

రాధ : మరేవిఁటది ? కూచోకూడదా ఏమిటి ?

రఘు : మా యింట్లోకూడా నీ ఆతిథ్యమేనా ?

(కుర్చీలో కూచుంటాడు. చిన్నవిరామం)

రాధ:(మాటమార్చి)ఇంట్లోపనితో చచ్చిపోతున్నాను బావా!

రఘు : (మాట్లాడడు)

రాధ : వంటదగ్గరనించి, నాన్నకు మందిచ్చేదాకా నేనే పను లన్నీ చూసుకోవాలి.

రఘు : (మాట్లాడడు)

రాధ : పనంతా మానేసి నిద్రపోవాలనిపిస్తుంది అప్పుడప్పుడు.

రఘు : (అప్పటికి మాటాడడు)

రాధ : నామీదకోపం – పోనీలే మాట్లాడకపోతే.

రఘు : (నవ్వేసి) ఏంమాట్లాడాలో నువ్వేచెప్పు.

రాధ : కవిత్వం చెబుతావుగా – మాట్టాడంరాదా యేవిఁ టీన్నకు ?

రఘు : మనసులో వున్నదేవిఁటో చెప్పకూడదూ – ఎందుకీ తికమకలు ?

రాధ : అక్కడెప్పుడయినా నన్ను జ్ఞాపకం చేసుకుంటావా బావా ?

రఘు : (విచిత్రంగా చూస్తాడు)

రాధ : అలాచూడకు నావైపు (కళ్ళు తప్పించుకుని) అబ్బ! ఉక్కపోస్తోంది బాబూ.

రఘు : (నవ్వి) విచిత్రమయిన మనిషివి రాధా నువ్వు. నిన్ను మ్యూజియంలో వుంచాలి. వుంచి "స్త్రీత్వం యీమెకు దేముడిచ్చిన వరం. మనిషినంతా తయారుచేసి, మనస్సు మిగిల్చి మెదడు వుంచడం మరచిపోయాడు" అని ఒకచీటీ అంటించాలి.

రాధ : ఏమో బాబు? నీదంతా విచిత్రం. నాకు తెలీదు. పోనీ ఎందుకు వెడుతున్నావో నువ్వు చెప్పకూడదా ఏమిటి?

రఘు : నే చెబితే నమ్ముతావా?

రాధ : (ప్రతీ అక్షరానికి అర్థంతో) నువ్వు చెప్పేవన్నీ నమ్ముతాను. కొన్నిమాటలు అర్థంకావు. అయినా ఎంతో గొప్పగా మాట్లాడుతావు. వింటాను తెలీకపోయినా.

రఘు : అందుకే నిన్ను మ్యూజియంలో వుంచాలన్నది.

రాధ : అమ్మ, నాన్న అందరిన్నొదిలి .... నాకుమాత్రం నువ్వు వెళ్ళిపోవడం ఏమీ నచ్చలేదు బావా. అమ్మ బాధపడుతుంది, నాన్నకు దిగులు, కన్నాకి చదువు చెప్పేవాళ్ళుండరు. నాకుమాత్రం...

రఘు : నీకేం? అన్నయ్య వున్నాడుగా?

రాధ : వుంటేనేం? ఏమీతోచదు నాకు. ఇక్కడికి వొస్తే నువ్వు కనిపించవుగా!... వెళ్ళనను బావా. వెధవ

డబ్బుకోసం నువ్వు వెళ్ళకపోతేనేం. డబ్బుంటే మాత్రం మేమంతా వుంటామూ బావా. నీకు జబ్బు చేస్తే అత్తయ్యా, నేనూ కూచున్నాం జ్ఞాపకం లేదూ? వెళ్ళకు బావా.

రఘు : రాధా వొక్కటడిగేదా?

రాధ : ఊఁ

రఘు : నన్ను మీరంతా పిచ్చివా డనుకుంటున్నారుకదూ.

రాధ : (బాధపడి) అదేమిటి బావా? నువ్వంటే నాకు అభిమానం ఎప్పుడూ వుంది.

రఘు : కాని యిదిమాత్రం నిజం రాధా! నేను డబ్బుకోసం వెళ్ళడం లేదు.

రాధ : మరి? ఎందుకు వెళుతున్నట్టూ నువ్వు?

రఘు : తెల్సుకుని ఏం చేస్తావు?

రాధ : ఏం చేస్తాను? వురిపోసుకుంటాను. సరా?

రఘు : (నవ్వి) మరీ అమాయకంగా మాట్లాడతావు రాధా! ఇలావుండగా నిన్నెప్పుడూ చూడలేదు నేను.

రాధ : భలేగామాటలు మారుస్తావే నువ్వు! పోనీలే చెప్పకపోతే.

రఘు : అహా, తెలుసుకుని ఏం చేస్తావన్నానంతే. అయినా నన్నాపితే నీకేం వొస్తుంది రాధా? చేతకానితనాన్ని అందంగా అలంకరించుకుని బతుకుతున్నాను నేను. అసలిది బ్రతకడంకాదు—ఈ కలల్లో కోరికల్లోపడి బ్రతుకుతున్నాను అని భ్రమపడడం. అర్థమయిందా?

రాధ : నీది మరీ విచిత్రం బావా!

రాధ : నీకు తెలీదురాధా! మనసులో రేగే యీ భావాలకు మాటల్లేవు. చెప్పడం చేతకావడంలేదు నాకు. ఆకాశపు రంగులు నాకెప్పుడూ నిర్వీరపాటుని కలిగిస్తాయి. అక్కడ దూరంగా ఎవరో తెలీని చిత్రకారుడు గీసిపోయిన త్రివర్ణచిత్రం వాటివెనక వున్నదనిపిస్తుంది. ఎప్పటికప్పుడు ముందుకు వురకాలనే దుగ్ధ—ఈ మనుషులూ, యీదుఃఖాలూ, యీ బంధాలూ అన్నీ మరచిపోతాను వాటినిచూస్తూ

రాధ : (నిర్వీరపోయి చూస్తూంటుంది)

రఘు : ఈ కోరికలకు అర్థంలేదు. ఆ కొండలవెనుక ప్రపంచాన్ని చూడాలనే తపన— సృష్టిశక్తుల సమిష్టి స్వరూపం అక్కడున్నట్టు— ఎవరో చెప్తున్నట్టు తోస్తోంది నాకు. సన్నగా, తీయగా, జీరవోని వేయి గొంతులు ఎలుగెత్తి ఎప్పటికప్పుడు నన్నాహ్వానిస్తుంటాయి.

(ఎక్కడో కొండలమలుపుల్లోంచి సన్నగా, తీయగా, గుండె కదిలించేదిగా ఎవరిదో గొంతు ఏమనో పిలుస్తోంది. పాటస్వరం పూరించుకు రాగ రాగిణీ మిశ్రమంలో వినిపిస్తోంది.)

ప్రియతమా! ప్రియతమా!
పిలుపు చేరగలేదె? భావాంచలమ్ములతో
భావముతో, రావముతో
కొండలన్నీ దాటి కోనలన్నీ దాటు

సెలయేటి ఝురులు - మా హృదిలోన
మెదిలె నిటు ప్రియతమా !

(పాట జరుగుతూండగానే మెల్లగా అంటాడు)

ఇదంతా వింటూంటే గుండె పరవళ్ళు తొక్కుతూంది - అంతలో ఆనందం, అంతలో భయం, వీటన్నిటికీ పయిన ఏదో చెప్పరాని తృప్తి... అంచేతే వెళ్తున్నా నివాళ. దూరాన ఎవరో పిలుస్తున్నారు నన్ను రమ్మని... అదిగో... అక్కడ...

(తిరిగి పాట) (ఫేడౌట్)

ఇప్పుడిక బోధపడిందా రాధా !

రాధ : ఎంత బాగా మాట్లాడతావు బావా ?

రఘు : ఇదిగాక మరో కారణంకూడా వుంది.

రాధ : ఇక్కడ నీముఖం కన్పించటంలేదు బాబు నాకు. (ఎదురుగ్గావచ్చి) ఏమిటిబావా అది?

రఘు : (తనలోతానే ఘర్షణపడి)పోనీ, ఎందుకులే ఆవిషయం.

రాధ : కాదు చెప్పుబావా!

రఘు : చెప్పనా ? కోపం రాదుకద ?

రాధ : అంత నమ్మకంలేదా నామీాద - పోనీలే.

రఘు : ఇంకోకారణం యేమిటో తెలుసా - నువ్వు.

రాధ : నేనా !

రఘు : నీమీాద ప్రేమ.

రాధ : బావా (రెండుచేతులతో ముఖం కప్పుకుంది)

రఘు : (ఏడుస్తున్నదేమోనని భయపడ్డాడు) ఏడుస్తున్నావా రాధా ? - చెప్పకూడదనుకుంటూనే చెప్పేశాను.

పోనీలే నామాటలూ, నన్నూ అన్నీ మర్చిపో - రేపట్నించి నేను కనుపించనుగా.

రాధ : బావా (ఏడ్చింది)

రఘు : అదేమిటి రాధా !

రాధ : వెళ్ళకు బావా నువ్వు - ఏమైనాసరే నాకోసం ఆగిపో.

రఘు : (నవ్వి) అంతావిన్నాక - ఈ ఆశలూ, కలలూ అన్నీ వినికూడా...

రాధ : ఎందుకు బావా నిన్ను మరీ అంత తక్కువచేసు కుంటావు. (కంఠంలో జీర) ఎప్పుడన్నా నీతో మాట్లా డాలనుకునేదాన్ని - నువ్వు నన్నెపుడూ పలుకరించవు. నిన్ను కదపడానికే భయం-ఎప్పుడన్నా చెప్పాలని....

రఘు : రాధా !

రాధ : అవును బావా. యిప్పుడిక సిగ్గుపడను. నాకోసం నువ్వు ఆగిపో బావా - నువ్వు లేకపోతే నేనేమౌతానో ఆలో చించు. నాకెవరూ లేరు - ప్రాణం పీక్కుతినే తండ్రి తప్పించి. నువ్వొక్కడికో వెళ్లిపోతావు. నేను వొంటరి దాన్నవుతాను.. వెళ్ళనను బావా...

రఘు : (ఇంకా మనస్సులో ఏదో అనుమానం పీకుతోంది. దాచుకోలేక అడిగేశాడు) మరి అన్నయ్యా, నువ్వూ కలిసి...

రాధ : అన్నయ్యా, అన్నయ్యా అన్నయ్యా— ఎందుకు బావా అలా పిచ్చి ఆలోచనలు పెట్టుకుంటావు ?

నామీద నీకు నమ్మకంలేదా... ఆగిపో బావా!
(కంఠంలో దైన్యత)

రఘు : మరి మామయ్య నన్ను తీసుకువెళ్ళాడానికి వచ్చాడా- నేను మాటకూడా యిచ్చాను. ఇప్పు డాగిపోతే—
(ఇంకా మనస్సులో సందిగ్ధం...)

రాధ : ఏమి అనుకోడులే — నీమంచిగురించి నువ్వు ఆగి పోడం తప్ప ?—ఏంబావా మాట్లాడవేం ? (ఇంకా అతను మాట్లాడకపోతే నిస్సహాయతతో రాధ గొంతు వణికింది. మరొక క్షణంలో దుఃఖం కట్టు తెగేట్టుంది) ఎటూ తోడులేనిదాన్ని నేను. నువ్వూ వెళ్ళిపోతే ఒంటరి దాన్నవుతాను. పైగా నువ్వే అన్నావు నేను కావాలని.

రఘు : అదిసరే— కాని యీ పరిస్థితి...

రాధ : ఇంకేం ఆలోచించకు బావా— మామయ్యతో మాత్రం యిదంతాఅనకు—ముఖ్యంగా నాగురించి- ఎలాగంటే ?— నే చెప్పేదా...' ఇలారా (పువ్వుల దండ పుచ్చుకుని రఘును చెయ్యిపట్టుకు తీసుకు పోబోతుంటే దండ తెగుతుంది—క్షణం నివ్వెరపడ తారు ఇద్దరూ. అంతాయాదృచ్ఛికం. తరువాత వెళ్లి పోతారు. కన్నావొచ్చి పూలను సేకరిస్తూండగా...)

( తెర )

# రెండవ రంగం

(కొన్ని క్షణాలతర్వాత. అంతా మొదటిరంగంలో లాగేవుంటుంది. మధ్య కుర్చీలో నీలూ కూర్చుని వ్రాసుకుంటున్నాడు. బయట యేదో బండి ఆగిన చప్పుడు, నలుగురిమాటలు వినిపిస్తుంటాయి. మరి కాస్సేపటికి భూపతిరావు చేతి కర్రకు బెలూన్లుకట్టి తీసుకువస్తాడు. రంగూన్‌లో కలప వ్యాపారం అతనిది. భారీ ఎత్తున సాగిస్తున్నాడు. బాగా డబ్బు ఆర్జించాడు. వయస్సు నలభైఅయినప్పటికీ ఇంకా మాటలో, నవ్వులో, కదలికలో చిలిపితనం, భోళాతనం పోలేదు. విపరీతంగా మాట్లాడతాడు. మాటకి ముందు తనని చెప్పుకోకుండా వదలడు.

ఇప్పుడతనొక్కడే లోపలికి వొచ్చాడు. వెనక వచ్చేవాళ్ళతో ఏదో కథ చెప్తున్నాడు. అదలా చెప్తూనేవున్నాడు.)

పతి : అంతే! ఆ దెబ్బకి కేబిన్ కేబిన్ అంతా మీదికి లేచిపోయింది. అంతా గొల్లున నవ్వడం సాగించారు. భలేగమ్మత్తులే— చెప్తే తెలీదు, మీరూ చూడాలి అంతే (చిన్న విరామం) ఓసారిలాగే— మలయప్పన్ తిరుత్తియూర్ అనే తమిళ మిత్రుడితో మాట్లాడుతూ ... (వెనక్కి తిరుగుతాడు. వెనకఎవ్వరూ కనిపించరు. ఆశ్చర్యపోతాడు.) ఓహ్! డామ్! ఏరీ వీళ్ళంతా? ఇంకా ఆ బండివాడితో తగాదాలు పడుతున్నారన్న మాట! అందుకే అంటారు మన వాళ్ళకు Sense of duty తక్కువని. (కన్నా నవ్వుతూండడం చూసి) హలో!—నన్నుచూసి నువ్వూ నవ్వుతున్నావన్నట్టూ యు లిల్లిపుట్! ఇందా నీకో ప్రజంట్ ... ఇంక చెక్కేయ్. రోజంతా తిరిగి

భోజనం వేళకి యింటికిచేరు... (కుర్రాడు పారిపోయాడు) Lovely young chap!

(ఇప్పుడు కేశవరావు, లలితమ్మా వచ్చారు సామాన్లని మోసుకుంటూ. కేశవరావు అన్నివిధాలా శేషుపోలిక. శరీరంలోనూ, ముఖంలోనూ అభిరుచుల్లోనూ యిద్దరూ అచ్చుగుద్దినట్టుంటారు. పొట్టిగా బలంగా చామనచాయగా వుంటాడు. లలితమ్మ మాత్రం సన్నగా పీలగావుంటుంది. వయసు ముదిరినా ఆమెలో యింకా వుత్సుకతపోలేదు. రఘుకి తలితండ్రుల్లో ఏమన్నా పోలికలున్నాయనిపిస్తే-అవన్నీ ఆమెలోనే ద్యోతకమౌతాయి. ముక్కులోనూ, కళ్ళలోనూ, పెదవుల్లోనూ అంతా ఆమె పోలికే.)

పతి : (వీళ్ళనుచూసి) ఆఁ - వచ్చారా? - ఏం చెప్తున్నానూ - (జ్ఞాపకం తెచ్చుకుని) ఇదీ - వెనకటికిలాగే మలయప్పన్ తిరిత్తియూర్ అనే తమిళ మిత్రుడితో మాట్లాడుతూ......

(కేశవరావు, లలిత వాళ్ళవాళ్ళ పనుల్లో నిమగ్నమయి వుంటారు. భూపతిమాటల్ని ఎవరూ పట్టించుకోరు)

లలిత : (పనిచేస్తూనే వసారాలోపలికి చూసి) ఇంట్లో ఎవర్లా లేనట్టుందే...

పతి : సరి? నా మాటలన్నీ గాలికి పోయినట్టే నన్నమాట.

కేశవ : (మంచంవేసుకుని కూర్చుంటూ) చెప్పవయ్యా నే వింటాను నిద్రవచ్చేవరకూ.

పతి : థాంక్యూ! (మధ్యకుర్చీని దగ్గరగా లాక్కుంటూ) ఇందాక చెప్పానుచూశావ్? నిజంకూడా అంతే బావా!

కేశవ : ఏంచెప్పావ్?

పతి : డామిట్ ! మళ్ళీ కథ మొదటికొచ్చిందే - అదే నయ్యా... ఇందాక దారిలో వివాహంగురించి ఓ Brief synopsis యివ్వలా?... "ఒకానురాకకూజా"ని (కోట్) చేస్తూ ?

కేశవ : ఆఁ. అవునవును.

పతి : అంతే ! నిజంకూడా అంతేబావా (అప్పుడే శేషు లోపలకు వొచ్చాడు. వాడివేపు చూడకుండానే ) నువ్వూ వినరా శేషు ! అసలు ప్రేమనేది దూరాన ఆకాశంలో మెరిసే నక్షత్రం. దానివేపే చూస్తూ గోతిలోపడ్డం వివాహం - గోథే అన్నట్టు. అంచేతే మనం వివాహం మానేశాం.

లలిత : మానేసి నువ్వు సాధించిందేమిటోయ్ ?

పతి : Nice question ! వెనకటికి "చింగ్-చా-చెన్"అనే చైనామిత్రు డుండేవాడు. సరిగ్గా యిదేప్రశ్న అడిగాడు. చెప్పేదను ఆకర్ణింపుడు.

లలిత : రెండుమాటల్లో చెపితేచెప్పు.

పతి : ధిక్కారమును సైతునా - పోతన అన్నట్టు.

కేశవ : పోతన కాదయ్యా.

పతి : కాకపోతే వాడితాతయ్యా ! ఏఁవిటిచెప్తున్నాను ?

శేషు : పెళ్ళిమాని —— ...

పతి : Exactly - పెళ్ళిమాని నువ్వు సాధించిందేమిటయ్యా అని వోప్రశ్న. జవాబుయిది - అసలు పెళ్ళిమానెయ్యడమే మనం సాధించిన కార్యం. అంతే. (అంద

రిసీ పరికించాడు) అంతమాత్రాన ప్రవరాఖ్యుడ్నని
అర్థంకాదు. ఒకసారిలాగే వల్లభాపురం జమీందారు
గారి భార్యతో మాట్లాడుతూ.

లలిత : అన్నయ్యా ?...

పతి : ఇస్ !... ఇంతకీ నాపట్టుదలగురించి మాట్లాడవలసి
వొస్తే...

లలిత : అన్నయ్యా ? (ఇంకా గట్టిగా)

పతి : ఉండవమ్మా ! శ్రీ:కి రెండు విషయాలు టూకీగా
చెప్పాలి. అసలు నా పట్టుదలచూసే కల్నల్‌కి నేనంటే
ఇష్టంబావా. పట్టుదల ముందూ పతి తర్వాతా పుట్టా
డంటాడు. ఒక చిన్న ఇన్సిడెంట్ చెప్తాను.

కేశవ : (మధ్యలో ఆపి) ఏదీ ? ఒక చుట్టయియ్యి.

పతి : చుట్టా ? నాన్సెన్స్. ఇండియా దాటంగానే ఇవన్నీ
మానేశాడు కెప్టెన్‌పతి. రంగూన్‌లో అనాథాసిగర్లు,
మలయాలో మాండలిన్ స్టిక్స్, జావాలో జరక్స్ —
ఈమధ్య బడ్జెట్ దిగజారడంవల్ల తగ్గిపోయాననుకో.
ఇంద వో సమిధ తగలెయ్. (Pause) అసలు చుట్టల
పంపిణీమీదే ఇంగ్లీషువాడు స్టీమ్ యంత్రం కని
పెట్టాడు.

కేశవ : (ఏదో చెప్పబోతే)

పతి : అహా ! గిరిశమే అన్నాడనుకో ! అయినా టెంపో
కోసం రిపీట్‌చేశాను. అంతే. ఇకపోతే వెనకటికి

వేటూరి ప్రభాకరశాస్త్రిగారితో మాట్లాడుతూ ఈ చుట్టలిన్నగురించి...

లలిత : అన్నయ్యా ?

పతి : (చిరాగ్గా) ఊ ! చెప్పూ.

లలిత : మీరు వెళ్ళకతప్ప దేమిట్రా ?

పతి : What a question ? ఎక్కడికి ?

లలిత : అదే ! చిన్నవాణ్ణి తీసుకువెడుతున్నావుగా ?

పతి : (Relax అయి) ఓహో ! అదా ? నైస్ థింగ్. ఈ ఆడవాళ్లు చూశావ్ - బావా ? అరణ్యాలో మొదలెట్టి కిష్కింధలో మునిగిస్తారు. అంతే ! అమ్మా చెల్లాయ్ ! అసలు Capt పతి (అంతలో కేశవరావు వైపు తిరిగి) ఈమధ్య నాకు రావుబహద్దూర్ యివ్వబోయారయ్యా. చెప్పడం మరిచాను. (మళ్ళా లలితతో) Capt పతి పూరికే ఎవడినీ తనతో తిప్పడు-తిప్పాడా తిన్నగా కేప్టెన్ని చేశాడన్నమాటే-ఇక రఘూని ఎందుకు తీసుకువెడ్తున్నావయ్యా అని అడుగు - A fair and beautiful chance - చక్కటి అవకాశం - నాలుగుపూళ్లు నాలుగుపోర్ట్సు - జావా, సుమిత్రా, గ్రిన్సుబే, లీడ్సు, లివర్‌పూల్, కేప్ ఆఫ్ గుడ్ హోప్ etc., etc. ఇవన్నీ తిరిగి వొస్తాడు. మరింత లోకజ్ఞానం కలుగుతుంది. ఎంతకాలం నీ వాళ్ళో Frog in the well అదే కూపస్థ

మండూకంలా కూచుంటాడు ? ఏమంటావ్? నేనన్న మాట బావుందా ?

లలిత : ఏమోరా? వాడు వుండిపోతేనే బావుండుననిపిస్తోంది.

పతి : ఏం వుండడం రేపొద్దున్న "సిలోన్ ఎక్కడరా అబ్బీ" అంటే "తిరపతయ్య కొట్టుపక్కన" అనకుండా నాలుగువూళ్లూ తిరిగొస్తాడు. జనరల్ నాలెడ్జి (కేశవ రావుతో) ఇది చూడు బావా మాండలిన్ స్టిక్ - మలయా సరుకు.

లలిత : (కేశవరావుతో) మీరు మాట్లాడరేం ?

కేశవ : ఏవిషయం ?

లలిత : అదేనండీ ! రఘూ వూరికెళ్ళడం గురించి.

కేశవ : ఓహో ! అదా ? నీకు తెలీదు వూరుకో.

లలిత : తెలిసేదేమిటి ? వాడు వెళ్ళడం నాకేం నచ్చలా ?

పతి : అందుకే ఎడ్యుకేషన్ లేని ఆడదాన్ని (టాకిల్) చెయ్యడం, a storm in the ocean వొకటంటాడు మా అటెండర్ బలదేవ్ సింగ్ ! వినవమ్మా ! నీది మరీ చాదస్తం. వాణ్ణి వో పెద్ద ఆఫీసర్ని చేస్తాను. రంగూన్నించి విశాఖపట్నం వెళ్ళే యే షిప్పూ మనచెయ్యి దాటిపోదుకద? రేపొద్దున్న వాడో పెద్ద కెప్టెన్ అయ్యాడంటే నేను పోయినా వాడు నిలబడతాడు. నా ఫరమ్ అంతా వాడిచేతుల్లోకి వస్తుంది. సరి ! ఈ కలహవర్తకం ఎలాగూ వుండనే వుంది. (కేశవరావుతో) ఏంబావా ? అందుకే ఆడ

వాళ్ళకు ఆలోచన తక్కువంటారు. నేనిన్నీ చేశాక వాడో అమ్మాయిని పెళ్ళిచేసుకుని కోడల్ని యింటికి తెస్తే మా అన్నయ్యే యింతా చేశాడని చెప్పుకుతిరుగుదువుగాని.

లలిత : సరేగాని ! వాడింటికిరావడం మరీ ఆలస్యం కాకుండా చూడు. ఇక్కడుంటానన్న మాటేగాని నా ప్రాణాలన్నీ వాడిమీదే వుంటాయి.

పతి : ఏదో పరాయివాడికి చెప్పినట్టు యీ అప్పగింతలన్నీ ఎందుకుచెప్పు – నువ్వలా చూస్తుండు. దొరలకుర్రాడిలా తయారుచేసి యింటికి తీసుకొస్తాను. సరేనా ! చూడుబావా ! చెల్లెలు మరీనూ !

లలిత : నీకేం తెలుస్తుందిరా యీ బెంగ ? నువ్వేం పిల్లల్ని కన్నావా, పెంచావా ?

పతి : మై గుడ్ నెస్ ! పిల్లల్ని కంటేనేగాని పిల్లల్ని గురించి తెలీదేమిటి ? ఆ మాటకొస్తే పిల్లలపెంపకం గురించి పెకింగ్ గ్లోబ్ థియేటర్లో ఆరుగంటలు లెక్చర్ యిచ్చాను. (సిక్సు అవర్స) అప్పటిదే యీ మచ్చ. ఓ ఫూల్ ఎవడో కోడిగుడ్డుతో కొట్టాడు. తప్పించుకునేసరికి చావుతప్పి కన్నులొట్టపోయినట్టయింది. అదో పెద్ద అడ్వెంచర్ లే.

శేషు : ఇంతకూ రఘూకి వెళ్లాలనే వున్నది మావయ్యా.

పతి : There lies the point'

శేషు : లేచినప్పటినుంచి వాడికి అదే ఆలోచన. అంతెందుకు? యివ్వాళ ఉదయంకూడా నాతో అదేఅన్నాడు.

కేశవ: నిజమేలే, వాడికీ వెళ్లాలనేవుంది. ఇక వాదనే లేదు. ఇంతవరకూ వీడి పత్తాయేలేదు – ఎక్కడికిపోయాడు చెప్మా! మళ్ళీ సముద్రం దగ్గరికి పోయి కూచున్నాడు కాబోలు.

లలిత : పరంధామయ్య అన్నయ్య కెలావుందో చూసొచ్చావురా శేషూ? రోజూ పొలంనుంచి అలా వెళ్ళొచ్చేవాడివిగా?

శేషు : ఇవాళ వెళ్లలేదమ్మా! రఘూని వెళ్ళిరమ్మన్నాలే. అయినా మావయ్య కిప్పుడేం, కాస్తబాగానే వున్నాడు.

లలిత : దగ్గూ అదీ తగ్గిందా అన్నయ్యకి?

శేషు : తగ్గింది. మరో మూడునెలల్లో పూర్తిగా నయం కావచ్చన్నాడు డాక్టరు. (తండ్రితో) నల్లావు యివాళ సరిగ్గా పాలివ్వడంలేదు నాన్నా. వోసారి చూసొస్తాను.

కేశవ : అలాగా ఏదీ వెళ్ళిచూడు పాపం, ఎలావుందో ఏమిటో దానికి.

పతి : (శేషువెళ్ళగానే) నైస్ బాయ్ – వీడయ్యా నీకు తగిన వాడు. ఇదిగో! వీడ్ని నా తరిఫీదులో పెడతా వేమిటి. అబ్రహామ్ లింకన్ అంతటివాడ్ని చేస్తాను.

కేశవ: అదిగో! అలాంటి పిచ్చి ఆలోచన్లు వాడిబుర్రలోకి ఎక్కించకు- మనిద్దరం దెబ్బలాటకి దిగాల్సి వస్తుంది మరి – (అంతలో Relax అయి) సరేలే; వాడిమనసు మార్చడం నీతరం కాదనుకో. పుట్టుకనుంచి వాడు నా పోలిక. పొలంలో పనిచేస్తూ కూచుంటే చాలు వాడికి – ఇంకేమీ అక్కర్లేదు. (గర్వంగా) అలా చూస్తూండు. ముందు ముందు యీపొలాన్ని యింకా ఎంత బాగుచేస్తాడో...

పతి: ఇప్పుడేం తక్కువగా వుందాబాబూ! (రాగయుక్తంగా) భోగవుజాట్లు కోటలుగ... పద్యం రాదు గాని అలావుంది.

కేశవ: (మరింత వుత్సాహంగా) ఇదేమిటి? కాస్త పైనా తక్కువయిందిగాని, యింతకు మరింత సాగుచేయించనూ వచ్చేయేటికి!

(శేషు వచ్చాడు)

శేషు: ఇంకేమన్నా చెయ్యాలా నాన్నా?

కేశవ: ఊహు. ఇంకేం లేదులే.

(శేషు లోపలికి వెళ్ళాడు)

లలిత: ఏవిటివాళ శేషు అదోలా వున్నాడేం?

కేశవ: వాడంతేలే. రఘూ వెళ్ళిపోతున్నాడని బాధపడుతున్నాడు వాడు. (పతితో) నీకు తెలీదు బావా! వాళ్ళిద్దరికీ ఎంత పొత్తనుకున్నావ్? అందరిలాగా కాదువాళ్ళు. అంతెందుకు – మామటుకు మేం –

మా అన్నదమ్ముల్లోకూడా యింత కలుపుగోలుతనం యెరగన్నేను.

పతి : నాకు నువ్వు చెప్పాలా? నే చూడ్డంలా? మన చిన్నతనం నాకు బాగా జ్ఞాపకం. ఒక చిన్న ఇన్సిడెంట్ చెబుతాను – నాకు బాగా జ్ఞాపకం – మా తమ్ముడ్ని – నా తరవాతవాడ్ని – గాలిపడగ చింపాడని పదిపీధు ల్తిప్పి పెద్దచెరువులో పీకవరకూ ముంచి వచ్చాను. అలాంటిది వీళ్ళిద్దరినీ చూస్తుంటే చచ్చేంత ఆశ్చర్యం వేస్తుంది – As a matter of fact సిగ్గువేస్తుందికూడాను, మన కాలంలో యింత అవకతవగ్గా ఏడిశాం కదాని...(లలితని చూపిస్తూ) ఇది మాత్రం తక్కువేమిటి – ఓసారి నేను రొట్టె ముక్క యివ్వలేదని...

లలిత : ఊరుకో అన్నయ్యా నువ్వు మరీనూ (భర్తతో) వీడు వెడుతున్నాడన్న దగ్గరనుంచీ రాధకూడా మారి పోయింది – సరి, యిక వాడి (రఘు) సంగతి చెప్పనే అక్కర్లేదు. ఇకపోతే పెద్దవాడుకూడా శాస్త్ర పట్టనట్టు తిరుగుతున్నాడు – చూశారుగా—

కేశవ : ఉండదూ మరి? వాళ్ళుకూడా మనలాగే కిందా మీదా అవుతున్నారు.

లలిత : ఊహు – అదికాదు విషయం –

కేశవ : (సాలోచనగా) కొంపతీసి – రాధ గురించి నువ్వు...

లలిత : ఊఁ... అదే –

కేశవ : (కాస్త విరామం) ఇహానువ్వు ఊరుకో ! పెద్దవా డంటేనే దానికి కాస్తమనసు. ఎప్పుడూ వాళ్ళిద్దరే కలిసి కనిపిస్తారు నాకు. (పతితో) ఏమంటావు బావా! వాళ్ళిద్దరి జంటా ఎలావుంటుందంటావు ?

పతి : తియ్యగా Sugar coated pill లాగా వుంటుం దయ్యా, సందేహంలేదు.

కేశవ : ఇలాచేస్తే వాడుకాస్త సుఖపడతాడు. ఎలాగూ రోజంతా వొళ్లు వొంచడమే వాడికి పని. ఈ కుర్రాళ్ళ మనసు నొప్పించి ఏపని చెయ్యడానికీ నాకిష్టం వుండ దయ్యా. ఈ విషయంలో మాత్రం వాళ్ళిద్దరికీ సరి పోయింది. చిలకా గోరింకలు అంటారు చూడు — అలాగ ! (భార్యతో) ఏం ? నువ్వేమంటావు ? అస లిలాంటి విషయాలు ఆడవాళ్ళతో సంప్రదించ కూడదనుకో; అయినా దగ్గరున్నావు కదాని లాంఛన ప్రాయంగా అడిగాను (పతితో) ఏదీ–అగ్గిపెట్టెయిలా అందుకో బావా (అగ్గిపెట్టి పుచ్చుకుని) ఈసారి వొచ్చినపుడు అయిదుకట్టలు– వాటిపేరేమిటన్నావు– ఆ – అనావాసిగార్లు తెచ్చిపడెయ్.

పతి : కట్టలేమిటి పాకెట్లను.

కేవశ : చూడు ! రాధ కనిపిస్తే ఓసారి నాముందు పడమను– ఆమాటఈమాటా కదిపి దాని మనసు కనిపెడతాను.

లలిత : రాధ పెద్దవాడ్ని పెళ్ళిచేసుకోదు తెలుసా ?

కేశవ : ఏమి ఏమిటి ? చేసుకోదూ ? ఇలాంటి విషయాలు కనిపెట్టడంలో ఆడవాళ్ళదే పై చెయ్యి అనుకో - అయినా యీ విషయంలో పప్పులో కాలువేశావు. అయితే. వీళ్ళిద్దరి మధ్యా ప్రేమ లేదంటావు?— అంతేనా?- లేకపోతే సేంలే. ఇవ్వాళ కాకపోతే రేపు ప్రేమిస్తుంది. ప్రేమకేంభాగ్యం? బోలెడంత. ఏం? నీకు మరీ రూఢిగా తెల్సినట్టు మాట్లాడుతున్నావు. ఏమిటి కథ ?

లలిత : ఇష్ (రఘూ వస్తున్నాడని సంజ్ఞ చేస్తుంది. బయటి నుండి రఘు వచ్చాడు. చాలా ఉత్సాంగావున్నాడు)

కేశవ : నీగురించే అనుకుంటున్నాంరా-మాటల్లో వచ్చావు. ఇంతసేపూ ఏంచేస్తున్నట్టు నువ్వు ? - ఇరవై నాలుగు గంటలూ అలా ఆకాశాన్నిచూస్తూ కలలు కనడమేనా? ఓసారైనా యింటివిషయం ఏమయినా పట్టించుకోడం వుందా ?

రఘు : అలా పరంధామయ్య మావయ్యను చూసొచ్చాను నాన్నా. అందుకని ఆలస్యం అయింది.

కేశవ : ఓహో ! అయితే మీ మావయ్య అయినా యివ్వాళ గుర్తొచ్చాడన్నమాట ! కాస్త నయం.

లలిత : ( చిన్నపిల్లవాడిన్ని బుజ్జగిస్తున్నట్టు ) ఇలా ఆరోగ్యం పాడుచేసుకోవడం మంచిదికాదురా అబ్బాయి... ఆ పల్చటి బట్టల్తో చలిలో కూచుంటే వొళ్ళేమవుతుంది చెప్పూ.

పతి : Ah! Ah! అందుకని వెచ్చటి శాలువ కప్పి భుజాని కెత్తుకోవమ్మా. మరీ చిన్నకుర్రాణ్ని చేసి బుజ్జగిస్తు న్నావు. ఇదే ఇంగ్లండులో అయితే నాలుగు రొట్టెముక్కలు పడేసి స్క్రూడ్రైవర్ చేతికిచ్చి తగిలేస్తారు షిప్ లోకి—డబ్బు తెచ్చుకు బతకండ్రా అని.

లలిత : ఊరుకో అన్నయ్యా - ఎవరో ఏదో వెధవపనిచేస్తే అంతా అలాగే చెయ్యాలంటావు. (రఘు ఏదో విష యంలో తికమక పడడం గమనించి) ఏంరా? ఏదో ఆలోచిస్తున్నట్టున్నావ్! ఏమిటి సంగతి?

రఘు : (కొంచెం సర్దుకుని, అందరినీ గమనించి, భూపతితో ప్రయాణం మానుకున్న సంగతి, రాధను పెళ్ళిచేసుకోబోతున్న విషయం చెప్పడానికి ప్రయత్నిస్తుంటాడు. మొదట తండ్రితో చెప్పాలని సంశయిస్తాడు - దూరాన వున్న తల్లి దగ్గరౌతుంది. రఘూ తల్లితో చెప్పబోయి అందరూ వున్నారని సతమత మౌతుంటాడు. ఈ పాటికి శేషు బయటనించి లోపలికి వొచ్చి పిట్టగోడను ఆనుకుని నిలబడ్డాడు. రఘూ అతన్ని గమనించ లేదు)

లలిత : ఏంవిటి నాన్నా ...?

రఘు : అది కాదమ్మా - మరి ...

లలిత : ఏంవిట్రా - (రఘూ చెప్పలేక పోవడాన్ని గమనించి, నవ్వి) పోనీ యిలారా ...

[అంటూ వంటింటి ద్వారంలోకి తీసు కెడుతుంది. రఘూ లోపల వుంటాడు - లలిత ప్రేక్షకులకి కనిపిస్తూంటుంది. కేశవరావు పతు లలో ఆతృత ద్యోతకమౌతుంటుంది.]

కేశవ : ఏవిటే ?

(తల్లీకొడుకులు యింకా మాట్లాడుకుంటూనేవుంటారు)

పతి : హారి యిదా! ఇంకేదో అనుకున్నాను. మారంగూ ప్రయాణంగురించా – అదే – వెరీ నైస్ బాయ్–అలా వుండాలి enthusiasm అంటే – I tell you-అలా చూస్తూండు వాడు ఫస్టుక్లాసు నావికుడౌతాడు. (నొక్కి చెపుతూ) అవుతాడు–నా మేనల్లు డనిపించు కుంటాడు.

కేశ : (విసుగ్గా) నువ్వు వుండవయ్యా (లోపలవాళ్ళతో) ఏవిటారహస్యం – ఇక్కడ చెప్పరాదూ.

లలిత : (ఆనందంతో వస్తూ) ఈ మాత్రానికే అంత యిదా తావేరా ? మాకూ కావలసింది కూడా అదే! ఏవండీ-నే చెప్పలేదూ ?

కేశ : ఏడిచినట్టుంది ! ఏం చెప్పావు?

లలిత : రఘు, అన్నయ్యతో వెళ్ళడంలేదు – మరేం (మురిసి పోతూ) వీడు రాధని పెళ్ళిచేసుకుంటాట్ట.

కేశవ : (ఆశ్చర్యపడి) ఆ! (relax అయి) ఆ, ఆ, తమాషాకం టున్నాడు లేవే (రఘుతో) వోరేయ్ ! రఘూ ! (విసుగుతో తనలో తను) అయినా యిప్పుడు – యింత పీకమీదికి వొచ్చాక ప్రయాణం మానేస్తే ఎంత అసహ్యంగా వుంటుందో వాడికి తెలుసు.

లలిత : లేదండీ–వాడు నిజంగానే వెళ్లడం లేదు. అసలు నేను యింతకుముందే చెప్పలేదూ ?

రఘు : (బెరుగ్గా వస్తూ) ఏమిటి ?
కేశవ : మీా అమ్మ చెబుతున్న విషయం.
రఘు : అవునా్నా్న ! నేను వెళ్ళడంలేదు.
పతి : ఎందుకని?
రఘు ; ఇంతకుముందువరకూ (శేషుప్రేక్షకులకు కనిపిస్తు న్నాడు) నాకీ ఆలోచనే తోచలేదు.
కేశవ : (విసుగుతో) అబ్బ ! అసలు విషయం ఏవిట్రా ?
లలిత : నువ్వుండు రఘూ ! (భర్తతో) అదికాదండీ రాధ వీడితో అన్నదటండీ ప్రేమిస్తున్నానని.
రఘు : నేను చెప్పాకే ఆ మాట అంది. అసలు బయల్దేరే వరకూ ఆ విషయం నాకూ తోచలేదు. (అందర్నీ చూశాడు) అంతా విచిత్రంగా (ఎవరూ మాట్లాడక పోవడం గమనించి) ఇలాంటి విషయాలు రాధముందు చెప్పకూడదనుకున్నాను. కాని ఎందుకనో చెప్పడం నావిధి అనిపించింది. చెప్పడంలో తప్పేముంది ? రేపు నేను వెళుతున్నాననేసరికి రాధ ఏడ్చింది. వెళ్ళొద్దని ప్రాధేయపడింది, బ్రతిమాలింది.
లలిత : దానిసంగతి నాకు తెలుసురా – మనసు ఏదీ దాచు కోలేదు; పిచ్చిది. నువ్వంటే దానికి ప్రాణం.
రఘు : అందుకే ఆగిపోతున్నానమ్మా. (అందరూ మౌనంగా వుండడం గమనించి) ఏం తప్పా?

(ఎవ్వరూ మాట్లాడలేదు. తల్లిమాత్రం ఒక్కసారిగా లేచి కొడుకుని ఆప్యాయంగా కౌగలించుకుంది.)

లలిత : ముమ్మాటికి తప్పులేదు రఘూ! నువొచ్చేముందే మీ నాన్నతో అంతా చెప్తున్నాను. అబ్బ! ఇప్ప టికి నామనస్సు తేలికపడింది.

కేశవ : (మాటలు కూడ దీసుకుని – గొంతు హెచ్చిస్తూ) ఛీ! ఛీ! అంతా తారుమారు చేసిపారేశావురా నువ్వు. డబ్బుకి డబ్బా దండగ – అనవసరంగా హంగామా. అయినా యీ ఆడవాళ్ళు మరీను. ఈ రాధ కేమొచ్చిందనీ వాడికో కబురు చెప్పి పూరు కొంది?... ఇంతకూ నే ననుకునేది...

లలిత : (మధ్యలో ఆపుతూ) సరేలెండి, మీరేమనుకుంటే ఎవరిక్కావాలి? ఇప్పుడీ కబుర్లన్నీ చెబితే ఏం లాభం? (అర్థయుక్తంగా) ఇప్పుడేమైనా తప్పు జరిగిందా ఏమిటి?

కేశవ : (ఆలోచిస్తూ, ఆమె వాదననికూడా అర్థంచేసుకుని) అంతేలే; నువ్వు చెప్పిందీ నిజమేలే (విసుగుతో తల అడ్డంగా తిప్పి) కాని యిదంతా...ఊఁ! సరే అయిం దేదో అయిపోయింది. ఒరే! వెళ్ళనన్నావ్ బాగానే వుంది. నువ్వు వెళ్ళకపోవడం మాకూ సంతోషమే. రాధ బుద్ధిమంతురాలు. లక్షణంగా కాపరాన్ని చక్క బెట్టుకుంటుందిలే.

రఘు : (ఆనందించాడు. లోపలకు వెళ్తున్నాడు)

శేషు : (ఇప్పటికి తేరుకుని ముందుకి వొచ్చాడు. బలవంతంగా నవ్వు తెచ్చిపెట్టుకుని అన్నాడు.) అదృష్టవంతుడివిరా...

రఘు : (హఠాత్తుగా అన్నయ్య కన్పించేసరికి నిశ్చేష్టుడయ్యాడు క్షణకాలం నోటమాటరాలేదు. అస్పష్టంగా) అన్నయ్యా... నువ్వా... నిన్ను చూడనే లేదు. ఎంతసేపయింది వచ్చి ?

శేషు : విన్నానులే. నాన్న చెప్పింది నిజం... రాధ నీకు తగినభార్య. మీరిద్దరూ హాయిగా వుంటారు.

(అన్నయ్యచేతిని తనచేతిలోకి తీసుకున్నాడు. శేషు కళ్ళలో బాధని చూస్తున్నకొద్దీ యితని గొంతు పెగల్లేను. గుటకలు మింగాడు.)

శేషు : వచ్చే యేడాదికి మంచి కొడుకుని ఎత్తుకుని...

(ఇక చెప్పలేక ముఖం దాచుకుంది గోడవేపు తిరిగాడు. అంతా నిశ్శబ్దంగావుంది)

లలిత : (భూపతితో) ఏం అన్నాయ్యా, నువ్వేం మాట్లాడవేం?

పతి : (తేరుకుని) ఓ సారీ (లేచివెళ్ళి రఘూ బుజం మీద తడుతూ) అదృష్టవంతుడివిరా భయ్యా— I wish you every success ! (Pause) బై ది బై నాతో రంగూన్ రావడంలేదా నువ్వు ?

రఘు : రాలేను మావయ్యా! యిప్పట్లో అసలు రాలేను. ఇంకే పరిస్థితులోనేనా వుంటే యిటువంటి అవకాశాన్ని వొదలుకునేవాణ్ణి కాదు. (తండ్రితో) ఏం నాన్నా ?

కేశవ : (లేస్తూ) సరే నీ యిష్టం.

పతి : (కోపం బిగబడుతూ) అయితే పీడిక్కడ ఆగిపోవడం ఖాయమేనా ఏమిటి బావా ?

కేశవ : ఇంకా అనుమానం ఏమిటి? వాడికి తోచినట్టు వాడు చేసుకుంటున్నాడు. చేసుకోనీ !

పతి : చేసుకోనీ ! అందులో నీకేమి జోక్యం లేదన్నమాట!

కేశవ : వాడింకా కుర్రాడేమిటయ్యా చెవి మెలేసి తప్పు దిద్దడానికి—

లలిత : బాగా అన్నారు. (లోపలికి వెడుతుంది)

పతి : (మరింత ఉడుకెత్తి) అయితే నువ్వు, పిల్లలికి కనీసం ఆడదానిమాటలకి కూడా ఎదురు చెప్పలేనంత పిరికి వాడవు అయ్యావన్నమాట. రేపు వాళ్ళు గంగలో దిగమంటారు. ఏంచేస్తావ్ ?

కేశవ : నా స్థితిలోవుంటే నువ్వుమాత్రం ఏం చేసేవాడివి?

పతి : ఏం చేసేవాడినా (కోపంతో వుక్కిరిబిక్కిరయి) ఇప్పుడెందుకులే - ఏం చేసేవాడినా - ఓ పిస్టల్ పట్టుకుని ప్రయాణం అయ్యేట్టు చేసేవాడిని. అదీసంగతి తెలిసిందా.

కేశవ : వయసొచ్చాక స్వతహాగా యిదిమంచీ, యిదిచెడూ అని తెలుసుకోవాలిగాని, ఎంతచెప్పి ఏం లాభం ? అయినా ఒకరి మనసు కష్టపెట్టి పనిచెయ్యడానికి నాకిష్టం వుండదయ్యా.

పతి : (హేళనగా) నాన్సెన్స్! - మనస్సూ - ఈ Mustached babies కి ఓ మనస్సూ, దాన్ని యిచ్చి పుచ్చుకోడమూను. ఊరుకోవయ్యా ఎవడేనా వింటే నవ్విపోతాడు. రెండు కబుర్లు చెప్పుకుని, మూడుసార్లు తిరిగేస్తే మనసూ, మనసూ కలిసిపోతాయేమిటి? ఒహ్వో! వీళ్ళకో మనస్సు - అది కలియడమూను... ఇదేగాని లండన్లో అయితే—

లలిత : ఉరిపోసుకు ఊరేగుతారు. అంతేనా? — పెళ్ళి, పిల్లలూ తెలీని నువ్వా మాట్లాడ్డవేం... ఊరుకో.

పతి : (ఈ హేళనికి చిర్రెత్తింది)ఎలాగైతే మీరే కన్నారు పిల్లల్ని. పెళ్ళికాకపోయినా అంత తెలీని వెధవని కాదులే.

లలిత : (అన్నయ్యమాటలకి నవ్వొచ్చింది) చిన్నప్పటినుంచి అనవసరంగా కోపం తెచ్చుకోడమంటే గొప్పసరదా లెండి. వాడిగురించి ఆట్టే పట్టించుకోకండి. (అందరూ నవ్వేరు) ఎందుకురా, ఏమీలేనిదానికి అంతకోపం తెచ్చుకుంటావు?

పతి : ఏమీలేదు? అయితే యిక్కడ జరిగే విషయాల్తో నాకేమీ సంబంధం లేదన్నమాట! అంతేనా నువ్వనేది. What a mass! మన కుటుంబంలో అందర్లోకి చిన్నవాడూ, ఏదో పనికొచ్చేవాడుగదాని వాణ్ణి తీసుకెళ్ళి నాలుగు విషయాలూ నేర్పాలనుకున్నాను. అవకాశం వుంటే అక్కడే వాడికేదో ఉద్యోగం

యిప్పించి వాడి బ్రతుకు ఓ రాస్తా పట్టించాలను కున్నాను. కాని మీరంతా కలసి నా వుద్దేశాన్ని చెడ గొట్టారు. చచ్చీచెడి, వాడికాళ్లూ, వీడికాళ్ళూ పట్టు కుని-ఫస్టుక్లాసు బెర్తు, మంచిభోజనం, వీడు చదువు కుందుకి యేర్పాట్లూ, మంచి లైబ్రరీ యిన్ని చేయించాను.

రఘు : నాగురించి చాలా కష్టపడ్డావు మావయ్యా.

పతి : ఇప్పుడిక ఆ గది ఖాళీగా పడివుంటే ఆఫీసర్లంతా యేమనుకుంటారు ?

లలిత : ఏమనుకుంటారేమిటి ?

పతి : అంతా యూస్‌లెస్ పీపుల్ ! (వెక్కిరింపుగా) ఏమను కుంటారా - ఎవతనో అమ్మాయిని లేవదీసుకుపోవ డానికి ప్లాను వేశారనుకుంటారు, ఇంతవరకూ నా కున్న పరువూ, ప్రతిష్ఠా కాస్తా మంటగలుస్తుంది. మంచికిపోయినందుకు నాకు బాగాశాస్తిచేశారయ్యా.

కేశవ : (నవ్వుతూ) వాళ్ళను అనుకుంటే యిక విచారించ వలసిందే లేదు. చకచటి ఓ అమ్మాయినిచూసి పెళ్ళి చేసుకో. ఇంకా నీకు కావల్సినంత టైమ్ వుంది. ఈ లోపున కానియ్.

(అందరూ నవ్వారు)

పతి : (ముఖం ఎర్రబడింది) చాలా తెలివిగా మాట్లాడావు గాని - పరిహాసాలకి యిది సమయం కాదు బావా.

శేషు : (అంతవరకూ నిలబడ్డ చోటునించి స్టేజి మధ్య కి వొచ్చాడు) నువ్వు చేసిన యేర్పాట్లను గురించి అట్టే బాధపడకు మావయ్యా – నీకేం అభ్యంతరం లేకపోతే నేను వస్తాను వాడికి బదులు.

(అందరూ దిగ్భ్రాంతులయ్యా రీమాటలకు)

రఘు : (విస్తుపోయి) అన్నయ్యా! (అతని కళ్ళవేపు చూడ లేక తలదించాడు) అలా వీల్లేదన్నయ్యా – నువ్వు వెళ్ళడానికి వీల్లేదన్నయ్యా.

శేషు : (నవ్వి) నీ సంగతేదో నువ్వు తేల్చుకున్నావు. నా సంగతి నేను చూసుకుంటున్నాను. ఈ విషయంలో నీజోక్యం అనవసరం.

రఘు : (అతని తీవ్రతకి కించపడి) అది కాదన్నయ్యా—

శేషు : (కొంచెం ఆవేశంతో) మధ్యలో నువ్వు కలుగజేసు కోకురా. నేచెప్తున్నాగా (పతితో) ఏఁవంటావు మావయ్యా?

పతి : (ఏం చెప్పాలో తెలీక కాసేపు తికమకపడ్డాడు) అనే దేముంది. వస్తే మంచిదే – తప్పకుండారా.

శేషు : అయితే యిక రూఢే. రెండు నిముషాల్లో సామాన్లన్నీ సర్దుకుంటాను.

లలిత : అన్నయ్యా వాడి మాటలన్నీ నిజమనుకుంటున్నా వేమో! ఊరికే నిన్ను వేళాకోళం చెయ్యాలని అంటున్నాడంతే.

శేషు : ( నిశ్చయంగా ) నేను పరిహాసానికి అనడంలేదు మావయ్యా. నా ముఖం చూసి చెప్పు.

పతి : వస్తే తీసుకువెళ్ళడానికేం ?

శేషు : అయితే నేను బయల్దేరుతున్నట్టె లెఖ్ఖ. నేనందరిలాగా కాదు. చెప్పిన మాటమీద నిలబడగలను.

రఘు : (అతని మాటల్లో శ్లేషకి మనస్సు చివుక్కుమంది) అన్నయ్యా – అది మంచిపని కాదన్నయ్యా.

కేశవ : (కటువుగా) కబుర్లు చెప్పగానే సరికాదురా శేషు ! అన్నమాటకి అర్థం వుండాలి.

శేషు : ( తండ్రివేపు తిరిగి ) నిజం నాన్నా – నేను మావయ్యతో వెళ్తున్నాను.

కేశవ : (కోపం రేగింది) ఎందుకని ? (నిశ్శబ్దం) ఇప్పుడిక్కడేం తక్కువయింది నీకు ?

శేషు : నాకెప్పుడూ వెళ్ళిపోవాలనే వుంది.

రఘు : అన్నయ్యా ! ...

శేషు : (రఘుని మాట్లాడొద్దన్నట్టు చూసి, తండ్రివైపు తిరిగి) రఘు వెళ్తున్నపుడు అడ్డం వస్తే బావుండదని వూరుకున్నాను. కాని యిప్పుడు వాడు ఆగిపోయాడు. కనుక నేను వెళ్ళడంలో తప్పులేదు.

కేశవ : తప్పులేదూ? (శేషు తండ్రిచూపు తప్పించుకున్నాడు) నా ముఖం చూసి చెప్పామాట ?

లలిత : (పొడగట్టే తుఫాను గ్రహించింది) మీరూరుకోండి. వాడేదో తెలివితక్కువగా మాట్లాడుతుంటేను.

కేశవ : (వినిపించుకోకుండా) చేతినిండాపని పెట్టుకుని యిప్పుడు దేశాలమీదికి పోయి నువ్వు చేసేదేమిటోయ్. మహా యిదవుతున్నావ్ ? ఇలాంటి సమయంలో నువ్వు పోతే పొలం ఏమవుతుందనుకున్నావ్ ?

శేషు : (అతనికళ్ళు తప్పించుకుని) రఘూనేర్చుకున్నాక ఆ పని చూసుకుంటాడులే.

కేశవ : ఓయబ్బో ! చెప్పావులే సలహా. వాడా పనికోసం పుట్టాలే.

శేషు : ఇక నేనేనన్నమాట ఆ పనికోసం చక్రాంకితాలతో పుట్టింది ? వాడికాపని చేతకాకపోతే మరోమనిషిని పెట్టుకోండి.

కేశవ : (ఆ మాటలతో కోపం కట్టుతెగింది) ఇంత దౌర్భాగ్యుడివై పోయావేంరా ?... మరోమనిషిని పెట్టుకునేదా ? నువ్విక్కడేం కిరాయికి పనిచేయడంలేదు. నువ్వుపోతే మరోమనిషిని తెచ్చుకోడానికి. పొలం మీద నాకెంత బాధ్యతవుందో నీకూ అంతేవుంది. కేశవరావు పొలంమీద యింకోమనిషి పనిచెయ్యగా ఎప్పుడన్నా చూశావానువ్వు ? నేను బ్రతికుండగా యింకోణ్ని పొలంమీద కాలుబెట్టనివ్వను. ఈ సంగతి నీకూ తెలుసు. తెలిసికూడా అవాకులూ, చెవాకులూ పేలుతున్నావు.

శేషు : ఇప్పుడిదంతా కెలకడం అనవసరం.

లలిత : శేషు! ఇంకమాట్లాడకు నువ్వు. వెళ్లి నీపని చూసుకో- వెర్రిమాటలు చెప్పక.

శేషు : నువ్వేం పొరపాటు పడకమ్మా - నేనెళ్లి తీరాలి.

కేశవ : అయితే నేనింత అరచింది కంఠశోషే నన్నమాట.

శేషు : అదంతా నాకు తెలీదు. నేనెళ్తున్నాను. వెళ్లితీరాలి! వెళ్లి ప్రపంచమంతా తిరిగిరావాలి! ఈ అవకాశం చచ్చినా వదల్లేను. వెళ్లితీరతాను.

కేశవ : అయితే వెళ్లిప్రపంచమంతా చూచివస్తావన్నమాట! ఇవతల తల్లీ - తండ్రీ, అందర్నీ తోసిపారేసి ప్రపంచాన్ని చూస్తావన్నమాట! చూడు - వీధుల్లోపడి, నా కళ్ళముందే నా కొడుకు లేచి వెధవ అబద్ధాలు చెప్పేరోజు వస్తుందని కలలోకూడా అనుకోలేదు. ఛీ! వెధవబ్రతుకు. నీలాంటివాడు వుంటేనేం? చస్తేనేం?

లలిత : ఏమండీ!

రఘు : నాన్నా!

పతి : బావా! ఏమిటాపిచ్చి?

(ముగ్గురూ ఒకేసారి అంటారు.)

కేశవ : నాకు చెప్తారేం? అదిగో, ఆదరిద్రుడి నోట్లో తలాయింత గడ్డి పెట్టండి.

శేషు : నీతో వాదిస్తూ కూచోడానికి తీరికలేదునాకు. ఎన్నయినా అరువ్! నాకేం బాధలేదు.

కేశవ : బాధ! నీకెందుకూబాధ? రెక్కలు వచ్చే నువ్వు
దువ్వే వదిలేశాంగా? ఇక నీ యిష్టం నీ[illegible]. అంతా
ప్రపంచం చూడడానికి వెళ్తున్నావ్
పుట్టిందగ్గర్నుంచీ నీసంగతీ, సబబూ యం. అలాని
నాకు. ఎన్నడూలేని ప్రపంచం నీ
ణ్ణుంచి వచ్చిందో అదీ తెల్సు... కాక
వాడు ఆ రాధని పెళ్లిచేసుకుంటున్నాడ, ఇదేదో అన

శేషు : నాన్నా! ఇక చాలించు! ఇలాంటి వెళ్ళిపోదా
నేపడను.

లలిత : అబ్బ! ఆమాట లేం పట్టించుకోకురా తెలుసావిషయం.
వెళ్ళు. ఆయనేం చెబుతున్నారో ఆయనక్కూ రాధా
లేదు. (తొందరగా వచ్చి కొడుకుని లోపలకు ఉద్దేశం,
ళ్లి
తూ అంది)

కేశవ : తెలుసుకునే అంటున్నాను అన్నిమాటలూను. వాడి
మొహం చూడు, నా మాటకి - ఒక్కదానికీ జవాబు
చెప్పగలడేమో? ఇంత జరిగాక యింకోడయితే
సిగ్గుతో చస్తాడు-ఛీ!

రఘు : నాన్నా?

లలిత : (శేషుని వదలి భర్తదగ్గరికి వచ్చి అతన్ని కుర్చీ దగ్గ
రకి తీసికెళ్ళే ప్రయత్నం చేస్తూ) మీరింక వూరు
కోరా ఏవిఁటిది? చెప్పండి, లేకపోతే నేను తల బద్దలు
కొట్టుకుంటాను.

శేషు : [illegible] మెల్లగా) నీతో మాట్లాడతానుండు ఒక్కనిముషం.

[illegible] ముఖం చూసి రఘూ ఆగిపోయాడు, రెండుచేతుల్తో ముఖం

లలిత : శేషు, [illegible] పోయాడు)

వె(ర్రి[illegible]చ్చి శేషుభుజం తడుతూ) ఆల్ రైట్ బ్రదర్!

శేషు : నువ్వే వస్తున్నందుకు సంతోషం. మొత్తంమీద

కేశవ : అయ్యదలా, నీ ఎదిరింపూ నాకు బాగా నచ్చాయ్.

శేషు : అదన్నుకు నాకు - నువ్వింతవాడివి ఎప్పుడు వెళ్లి [illegible] అనిపించిది. ఏ emotion! ఏ vigour! చచ్చినో[illegible]కారంతా అలావుండాలి. నీలాంటివాళ్లకి

కేశవ : అయితే బాగా గడుస్తుందిలే. ఫస్టుక్లాసుగా ఇక్షతల[illegible]వయ్యా" అని నువ్వే అంటావుచూడు చాలిస్తే. (చివరిగా ఆతని భుజంతట్టి) సరేగాని, నామాన్లన్నీ సర్దుకో. ఈలోపున నిద్రపోగలిగితే ఓ గంట కునుకుతియ్యి. అలారం కొట్టినట్టు సరీగా నాలుగయేసరికి తయారయిపోతాను. ఊరికే అలా ఏడుస్తూ కూచోకు - డిపాజిట్ పోయిన రాజకీయ వేత్తలాగ! రఘు మనతో హార్బరువరకూ వస్తాడులే! మరి వస్తాను. గుడ్ నైట్ బాయస్ !

(బయటకు వెళ్ళాడు)

(రఘు కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు. క్షణం నిశ్శబ్దం. శేషు తమ్ముడి భుజంమీద చెయ్యివేసి)

శేషు : ఊరుకోరా, ఊరికే చిన్నపిల్లాడిలా అలా బెంబేలు పడతావేం? అన్నీ మనం అనుకున్నట్టే జరుగుతాయా ?

రఘు : (ఏడుస్తూ అన్న భుజం మీద వాలాడు) నువ్వో నాన్నతో అన్నదంతా అబద్ధం-అన్నయ్యా. అంతా వట్టి అబద్ధం.

శేషు : అవును. అబద్ధమే. నాకు తెలుసావిషయం. అలాని ఏం చేస్తాం చెప్పూ?

రఘు : నాన్న నిన్ను ఎప్పటికీ క్షమించడు. ఇదేవో అనర్థానికి దాపురించింది. అసలిక్కడ్నించి వెళ్ళిపోదామని ఎందుకు తోచింది నీకు.

శేషు : ఎందుకా? నాకంటే నీకే బాగా తెలుసావిషయం. (రూఢిగా) ఒక్కటి చెప్తాను విను. నువ్వూ రాధా హాయిగా బ్రతకడమే కావాలి నాకు. నా ఉద్దేశం, నా కోరిక అదే. అంతమాత్రాన, మీరిద్దరూ పెళ్లి చేసుకుని మీ పిల్లల్తో, మీ సుఖాలతో, మీ అదృష్టాలతో బ్రతుకుతూంటే నేను మాత్రం నా పొరపాట్లను తల్చుకు ఏడుస్తూ బ్రతికేదా? నీ మంచి కోరతాను సరే. కాని యీ బాధ? దీన్ని సహించలేన్నేను. ఇవ్వాళ సంఘటన గుర్తుకుతెచ్చుకుంటూ నే ననుకున్న కలలన్నీ తప్పని బాధపడుతూ... అబ్బ! యిక్కడ వుండలేను.

రఘు : (మెల్లగా) ఏమిటో అనుకున్నాను. చాలా ఘోరం జరిగిపోయిందన్నయ్యా. ఇంత జరుగుతుందని తెలిస్తే రాధతో ఒక్కమాటయినా అనేవాణ్ణి కాదు.

శేషు : (ఆప్యాయంగా నవ్వి) నాకు తెలుసు. అలా చేస్తే రాధ జీవితమంతా బాధపడేది, నన్ను పెళ్లిచేసుకుని. జరగాల్సిందేదో జరుగుతుంది. మనం ఎదురుగ్గా నిలబడతాం. అంతే. నా ఉద్దేశం ఏమిటో నాన్న తర్వాత తెలుసుకుంటాడు.

రఘు : కాని అమ్మ గురించి ఆలోచించన్నయ్యా. (కొద్ది విరామం) ఊహుఁ—నువ్వు వెళ్ళడానికి వీల్లేదన్నయ్యా—వెళ్ళడానికి వీల్లేదన్నయ్యా.

శేషు : (కొద్దికోపంతో) నామాట విను తమ్ముడూ (తమాయించుకుని— ఒప్పిస్తూ) నేను వెళ్ళాలి; వెళ్లితీరాలి. ఇక్కడ వుంటే పిచ్చెక్కుతుందిరా నాకు. (రఘు విముఖంగానే వున్నాడు) ఒక్క విషయం—రాధ నీకు కావాలి, నాకూ కావాలి; కాని యిప్పుడు రాధ నీది. ఇక్కడుంటే నాకు యింకా ఆ భావం పోదు. ఇటువంటి పరిస్థితుల్లో నేనిక్కడ వుండడం మీ యిద్దరికీ మంచిదంటావా?...నువ్వయితే ఏం చేస్తావు అలాంటప్పుడు. (రఘు విస్తుపోయాడు) నిజం చెప్పు—నువ్వూ ప్రేమిస్తున్నావు—అప్పుడేం చేస్తావ్? చెప్పు.

రఘు : (మతి పోయినట్టయి) వెళ్ళిపోతాను, ఎక్కడికో ఎవరికీ తెలీనిచోటికి... (రెండు చేతుల్తో తలపట్టుకుని ఏడుస్తాడు) భగవాన్!

శేషు : నేనెందుకు వెళ్తున్నానో యిప్పుడు తెలిసింది నీకు. ఇక చెప్పాల్సింది లేదు. (పక్కకి తిరిగేసరికి వీధిగుమ్మంలో

తలవంచుకుని రాధ కనిపించింది. శేషు నిశ్చేష్టు డయ్యాడు. రాధవచ్చి నమస్కరించింది మౌనంగా)

శేషు : (నిర్ఘాంతపోయి) ఏమిటి రాధా ఇదంతా ?

(రాధ మాట్లాడలేదు. అలాగే వుండిపోయింది)

శేషు : మరీ పిచ్చిదానివి కాకు. లే! లే! నువ్వూ యిలా దిగ జారిపోతే ఎలా ? (పెద్ద విరామం)

నువ్వు వెళ్ళు రఘూ-రాధతో నేనో మాటచెప్పాలి.

(రఘు తలఎత్తకుండానే పడకగది వేపు నడచిపోయాడు)

శేషు : (కాస్సేపయాక) అలా కూచో రాధా ఒక్కసారి.

(తల వొంచుకొని కూచుంది.)

శేషు : ఒక్క విషయం ... (ఏదో చెప్పబోయి ఆగాడు. కాస్సేపు తటపటాయించాడు. ఇంతలో కన్నా కని పించాడు. ఏదో తోచి) ఏంలేదు రాధా ! నువ్వెళ్లు.

(ఆశ్చర్యపోతూ అతని ముఖం చూచి మెల్లగా లేచివెళ్ళిపోయింది. శేషు కన్నాని దగ్గరగా లాక్కుని ఏడ్చాడు. తేరుకుని చేతిమీద ఏదో వ్రాస్తూ చెబుతున్నాడు.)

— తెర —

# షష్ఠమ రంగం

మూడేళ్ళ తర్వాత. నిప్పులు కురిసే వేసవిలో ఒకనాటి మిట్టమధ్యాహ్నం. తలుపులన్నీ తెరిచేవున్నాయి. కాని గాలి ఏ మాత్రం వీచటం లేదు. పడకగది కర్టెను చిరుగులుపడి అసహ్యంగా కన్పిస్తోంది. గోడలకు అక్కడక్కడ పెళ్లలు రాలిపోయాయి.

వస్తుతః ఆ గది అంతగా మారకపోయినా అక్కడి వాతావరణం చాలా మారినట్టు తోస్తుంది. మరి కాస్త జాగ్రత్తగా పరిశీలిస్తే ప్రతీవిషయంలోను ఏదో మందకొడితనం. కుర్చీలు నల్లగా నూనెకారుతూ ఉన్నాయి. మడతకుర్చీగుడ్డ (ఎర్రచారలది) నల్లగా మచ్చపడింది. ఓ చెయ్యి విరిగిన చిన్న బొమ్మ మధ్యకుర్చీమీద పడి ఉంది. మరికొన్ని పాతబొమ్మలు కూడా ఉన్నాయి.

వంటింట్లో గిన్నెల శబ్దం విన్పిస్తోంది. మూలగా ఓ తోపుడుబండీ వుంది. దాంట్లో ఓ అమ్మాయి నిద్రపోతోంది.

కర్టెను లేచేసరికి లలితమ్మ ఎడమవైపున కుర్చీలో కూచొని చిన్నపిల్ల గౌనుకు మాసిక వేస్తోంది. ముఖానికి కుంకుమ కన్పించదు. ముఖంలో కళ, యిది వరకటి ఉత్సాహం, జీవం, అంతాపోయింది. పేలవంగా, నీరసంగా వుంది. బలహీనమయిన కంఠంతో తప్పనట్టు మాట్లాడుతుంది.

తెరతీసిన కాస్సేపటికి వీధిలోంచి పరంధామయ్య వచ్చాడు. రాధ తండ్రి ఏభైదాటిన వాడు. సన్నగా, చామన చాయగా ఉంటాడు. నుదుటికి సరిపడ గంధం, కుంకుమబొట్టూ, కళ్లలో వక్రత్వం కన్పిస్తూంటుంది. పక్షవాతంవల్ల ఓ చెయ్యీ, కాలూ, అంతగా పనిచెయ్యవు. అంచేత కుంటుకుంటూనే నడుస్తాడు. ప్రతిదానికీ విసుగుచూపుతాడు. క్షణకాలం మాట్లాడకుండా ఉండలేడు. అదువల్ల ఇటీవలే దగ్గు అంకురించింది.

పరం : (నీరసంగా వంగి నడుస్తున్నాడు. వచ్చి) ఏం లలితమ్మా! - అల్లుడు యింకా యిల్లు చేరలా?

లలిత : (మందంగా) లేదన్నయ్యా! యీపాటికి రావల్సిందే మరి.

పరం : (కుర్చీలో మఠం వేస్తూ) ఆఁ వాడెప్పుడప్పుడే ఎక్కడ వస్తాడులే. అపరాహ్ణం దాటందీ ఎప్పుడన్నా అడుగు పెట్టాడూ యింట్లో? – ఎబ్బే! – (కూర్చొని) చూడు లలితమ్మా – ఏ విషయమన్నా పుట్టుకతో స్వతహాగా పుట్టిరావాలమ్మా – అవునంటావా? కాదంటావా?

లలిత : (తలూపింది.)

పరం : అవునుకద! అలాంటిది వాడికి పుట్టనూ పుట్టదు, ఒహడు చెప్తేనూ వినడు, అదేం ఖర్మమమ్మా! ఇంత వేళయింది, ఇదీ తినకపోయి, వీడూ తినకపోతే ఏం కాపరాలు చెప్పు. ఏం, నేనన్న మాట బావుందా?

లలిత : నిజమే మరి.

పరం : అసలు వాడి తరహాయే అది, పోనిద్దూ. ఇన్నాళ్ళబట్టి చూస్తున్నాను. వేళపాటున యింతతిని పెళ్ళానికి ఓ పండూ, కాయా తెచ్చిపెట్టాడూ? – ఏబ్బే! తీసుకు రావడం మాట అలా వుణ్ణీ. మరీ సత్రవు తంతయ్యి పోతే తిండికి? – అమ్మా, రాధమ్మా (పిలిచాడు.)

రాధ : (లోపలున్నించి) ఏం నాన్నా?

పరం : కాస్త నిప్పు పెట్టమ్మా... చూడు లలితమ్మా— నువ్వేమంటే అను – యీ పిల్లదాని కాపరం చూస్తే మరీ మతిపోయింది నాకు, ఓ తీరూ తెన్నూ ఉంటేనా?– పైగా...(రాధ వచ్చింది నిప్పుతో)ఆఁ... తెచ్చావా

అమ్మా... (చుట్ట వెలిగిస్తూ) నాలుగు మెతుకులు కతికావా, అదీ లేదా?

రాధ : ఆయన రావాలి నాన్నా?

పరం : సరేలే. వాడొస్తాడూ, అయింది. నువ్వూ తినకపోతే పిల్లకి పాలుంటాయా చెప్పు?

లలిత : అవునమ్మా.

రాధ : (విసుగ్గా) సరేలే అత్తయ్యా! నాన్నతోపాటు నువ్వూను... (వెళ్తుంది.)

పరం : సరి. ఈ మూడేళ్ళ కాపరంలోనూ సుఖం మాట ఎలా వున్నా కస్సుబుస్సులాడడం నేర్చుకుంది. 'ఏమమ్మా' అని మాట కదిలిస్తే హింత కోపం – ఉస్! ఏం కాపరాలో ఏమిటో? – (విసనకర్ర అందుకొని విసురుకుంటాడు.)

లలిత : నీ దగ్గు ఎలా వుందన్నయ్యా (బట్టలు కుట్టుతూనే)

పరం : దగ్గా! యిదో దగ్గా లలితమ్మా. మహమ్మారీ అయిపోతేనూ? ఓ రాత్రికి లేస్తానా? యిలా నరాలు తెగిపోయేట్టు కిరకిర కిరకిరా చుట్టేస్తుంది. నిభాయించుకు నిలబడేసరికి గంటవుతుంది. (నిట్టూర్చి) మరేవుంది? ఇలా అటు పడి, యిటు పడి ఎప్పుడో హరీ! అంటాను.

లలిత : అదేమిటన్నయ్యా అలా అంటావ్? నీకేం! నిక్షేపంలాగ ఉంటావ్.

పరం : ఏంవుంటానో లలితమ్మా. రేపు రోజు మనది గాదు కద— ఈ కూతురు కాపరం మరీ గుండెలో రాయి

అయిపోయింది. ఓ తీరూ, తెన్నూ ఉంటేనా ? — అసలు, మన రఘూ ఉన్నాడే !— వాడు పట్టి చేత కానివాడయి ఊరుకున్నాడమ్మా... ఆహా ! చేత కానివాడే! పైగా చెప్తే వినడు. ఒకసారా! రెండు సార్లా ? ఆ దారిని పోయేటప్పుడల్లా వెయ్యి విధాలా చిలక్కి బోధపరిచినట్టు బోధపరుస్తూంటాను - యిలా చెయ్యాలి, అలా చెయ్యాలి అని. వాడు వింటేనా ? ఎతీ అంటే పెతీ అంటాడు. నాకీ చెయ్యీ, కాలూ లేక పోవడం వల్ల గానీ, నేనో చెయ్యి అందించనూ ? ఏమంటావ్ ?

లలిత : నిజమే అన్నయ్యా.

పరం : పోనీ, నువ్వోసారి చెప్పిచూడకూడదూ వాడితోటి !

లలిత : ఏమని ?

పరం : ఏమనా? 'వేళకి యింత తిని, యిటు పనీ, అటు పంటా చెడకుండా చూసుకోరా కుంకా' అని చెవి మెలేస్తే సరి.

లలిత : చెప్తే వచ్చేవా యిలాంటి విషయాలు ? - ఒకటీ, రెండేళ్ళలో వచ్చేవి కనకనా? - ఇదిలా జరగాల్సిందే.

పరం : సరి. మూడేళ్ళు చాలాయి కాదుకాని, ఇహ నేర్చు కుంటాడనే. నాకేం నమ్మకంలేదు. అయినా నువ్వ న్నదీ నిజమేలే. ఇకమనం యిలా దిగజారాల్సిందే.

లలిత : అక్కడికీ వొళ్ళువంచి రాత్రీ, పగలూ పనిచేస్తు న్నాడు వాడు.

పరం : పని చేస్తున్నాడమ్మా-అందరికన్నా ఓ వీసం ఎక్కువే చేస్తున్నాడు. కాని ఏదీ ? కష్టానికి తగ్గ ఫలం దక్కితేనా ? పోసీ మీా విషయం అలా వుంచు. వీడివల్ల నాకూ ఓ పక్క దెబ్బ తగుల్తోందే! నా పొలం మట్టుకు వీడిచేతుల్లోపడి బాగయి తగలడిందేమిటి ? – వీడి పొలంతోపాటు నాదీ 'గోహోవిందా' చేస్తున్నాడు. ఇదీ వరస. వీణ్ని తిడుతున్నాననే అనుకోకు. నాకు మాత్రం చేదేవిటి వీడి మీాద అభిమానం ? – ఏదో వుండలేక వాగడం.

లలిత : ఇంతకీ యిదంతా మన దురదృష్టం అన్నయ్యా –

పరం : అదిగో, ఆమాట అంటేనే ఒప్పేదిలేదు. మన చేతకానితనం అనక, దురదృష్టం అంటావేమిటి ? దురదృష్టం కాకపోతే ఖర్మ – అంతేనా లలితమ్మా ! రెండేళ్ళాయి–అంటే బావపోయినప్పట్నుంచీ పొలం విషయం "నానాటికీ తీసికట్టు" అవుతోందంటావా ? లేదంటావా ?

లలిత : (భర్త జ్ఞాపకం రావడంతో చలించింది) అదో పెద్దదెబ్బ !– దేవుడయినా తిన్నగా చూశాడు కాడు.

పరం : సరేలే. ఏదో సామెత చెప్పినట్టుంది నీ మాట. బావే వుంటేనా, యిలా ఉండనిచ్చేవాడా ? ఎలాగోలాగ– అప్పోసప్పోచేసి యీ నాగమ్మని పక్కకి తోసి తనూ నడుం కట్టడూ ! – ఇంతకూ, మనకు అదృష్టం లేదు, బావ కాస్తా కన్నుమూశాడు.

లలిత : (కళ్ళు చెమర్చాయి) అవును అంతాఅయిపోయింది ఆయనతోటే.

పరం : (తేరుకుని) చెప్పవచ్చేదేమిటంటే, అప్పటినుంచి యిప్పటివరకు రఘూ చక్కబెట్టిన ఒక్కపనీ బావుండ లేదని - అవునమ్మా! ఎలా బావుంటుంది? వీడు చేస్తున్న ఒక్కపనీ నీకు చెప్పడాయె. నువ్వయినా అడగవ్. ఇంకా రాధ కాస్తనయం. ఒకప్పుడు కాక పోతే ఒకప్పుడన్నా "ఏం చేయమంటావునాన్నా?" అంటుంది. నిజానికి నిన్నరాత్రి? పోనీలే, ఆ విషయం ఎందుకు చెప్పడం?

లలిత : ఏమిటన్నయ్యా?

పరం : ఏముందమ్మా - మీావాడి ఘనకార్యం. అసలు యిలాంటి విషయాలు చెప్పొద్దని మరీమరీ చెప్పిం దనుకో. అయినా వుండబట్టలేక ముసిలిముండావాణ్ని మీామేలు కోరేవాణ్ని గనక చేప్పేస్తూంటూగా.

లలిత : ఇంతకీ విషయమేమిటి చెప్పు?

పరం : ఇది వినేసరికి దానికి మతేపోయింది. ఇహ నాసంగతి అడక్కు. వెన్నుమీాద పెడీమని చరిచినట్టనిపించింది. సంగతి యిది. (అటూఇటూ చూసి మెల్లగా చెప్పాడు) రేపొద్దున్న ఆ పొలాన్ని తాకట్టుపెట్టి డబ్బు తెస్తాడు.సాగుకి (వ్యంగ్యంగా) పెద్దపండుక్కి యింటినిండ బోలెడంత పంట. ఇహచూచుకో. ఇప్పుడేమంటావ్ నీ కొడుకుగురించి.

లలిత : ఏ పొలాన్ని ?

పరం : ఏపొలాన్నీ ! – ఆ పొలాన్నే. సాక్షాత్తూ కేశవరావు గారి పదెకరాల పల్లాన్నే ! సరా ? – రేపు నీముందో కాగితంఉంచి బుజ్జగింపుగా ఆమాటా యీమాటా చెప్పి "సంతకం చెయ్యమ్మా" అంటాడు. నోటు మీద – చేస్తావా ? చెయ్యవా ? అది చెప్పుమరి.

లలిత : రఘు ఏదిచేయమంటే అదిచేస్తాను.

పరం : (ఆశ్చర్యపోయి) చేస్తావ్ ! నే నింత చెప్పాకకూడా చేస్తావన్నమాట ! నీ పేరిట వున్న పదెకరాలముక్కా పోయిందంటే రేపు నువ్వూ, నీ కోడలూ, నీమనుమ రాలూ ఏమవుతారో ఆలోచించు. చస్ ! మధ్య నా కెందుకులే బాధ ? మీరూ, మీరూ ఏం చేసు కుంటారో చేసుకోండి.

లలిత : పెద్దవాడు వచ్చేవరకూ వీడు చూసుకుంటేచాలు. ఇం కెంత ? వాడు రానేవస్తున్నాడు.

పరం : పెద్దవాడు చూసుకోక ఏంచేస్తాడులే. వా డిలాంటి వాజెమ్మ కాడు. శేషు పనిచేశాడు అంటే యిలా పటానికి ఫ్రేము కట్టినట్టేకదూ ? (ఉత్సాహంగా) అయితే ఎప్పుడొచ్చేస్తానని రాసేడేవిటి ?

లలిత : ఎప్పుడేవిటి ! ఘడియలోనో సగంలోనో యిక్కడ ఉండనే వుంటాడు. మొన్న పౌర్ణమినాటికి వాళ్ల పడవ కలకత్తాలో వుందిట. ఈపాటికి వచ్చేసే వుంటుందన్నాడు రఘూ.

పరం : ఇంకేం ! వొళిపొచ్చేస్తున్నాడన్నమాట ! వారెవా! వాడమ్మా మనిషి ! బాగుపడేమార్గం వున్నప్పుడు తండ్రయిరి, తాతయిరి, తాళ్ళు తెంపుకు పారి పోయాడా ? ఇప్పుడుచూడు, ధనరాసులు నెత్తికెత్తు కుని తల్లికోసం పరిగెత్తు కొచ్చేస్తున్నాడు. ఇప్పు డేమంటావ్ ?

లలిత : నిజమే అన్నయ్యా. అంతా దేవుడి దయ.

పరం : దేవుడేం చేస్తాడమ్మా - దేవుడు! గట్టిగా పిలిస్తే పలక నన్నా పలకడు. వాడిసత్తాను చూద్దూ - ఇక్కడ కాలుపెట్టగానే యిల్లంతా స్వర్గం చేసిపోతాడు. (నీలూ వచ్చాడు) ఒరే నీలూ మ్మామా ? - మీ అన్నయ్య వస్తున్నాడటరా... అన్నయ్య (సంజ్ఞ చేశాడు)

(నమ్మకం చాలక నీలూ తల్లి వేపు చూస్తాడు. తల్లికూడా నవ్వుతూ తలూపింది. వాడు సంతోషంతో గంతులేశాడు)

పరం : ఒరే, బువ్వ తిన్నావురా కన్నా?

నీలూ : (బోధపడలేదు)

పరం : బు... వ్వ... (కడుపు చూపించాడు)

నీలూ : (కూచొని పలకమీద వ్రాశాడు-'లేదు' అని)

పరం : సరి;నాది వానాకాలం చదువులే. చదివేనా? చచ్చేనా? చెప్పు. తిన్నావా? లేదా?

(నీలూ తినలేదన్నట్టు తల తిప్పాడు)

పరం : నువ్వూ తినలేదూ; (తెరలోకి చూస్తూ గట్టిగా చెప్పాడు) అవునమ్మారాధా! — యీచిన్నవాడ్ని

కూడ ఎందుకుంచీసేవే భోజనం పెట్టకుండానూ ? పేగులార్చుకుపోతాయి వెధవకి. ఇంత పడేయి. తినేసి ఏమూలో దొర్లిస్తాడు... (నీలూతో) వెళ్ళరా... బువ్వతిందూగాని...

(నీలూ 'అన్నయ్య రావాలి' అని సంజ్ఞ చేస్తూ చెప్పాడు)

పరం : అబ్బోసి! చూశావమ్మా వీడిబుద్ధి! – అన్నయ్య వస్తేనేగాని తినడట. నోరులేదుకాని ఉంటేనా ? వెధవ పికిలిపిట్టలాగ కబుర్లు గెప్పేసి పెద్దకలెక్టరయి పోడూ ?

లలిత : భూపతన్నయ్య వ్యాపారంలో మానేజరయ్యాట్ట పెద్దవాడు.

పరం : హోరి! ... చెప్పావుకాదు ? – యిహ మాకు యిన్ని బూరెలు తినిపించే దెప్పుడో అడుగుతా నుండు – రాగానే—

లలిత : (ఊహిస్తూ) ఈపాటికి చాలామారిపోయి ఉంటా డేమో ? – (నవ్వి) అబ్బ! మూడేళ్ళు! మూడు యుగాలు గడిచినట్టుంది. (ఉన్నట్టుండి కళ్ళల్లో నీరు నిండింది) ఆయనేవుండి – వాడ్ని క్షమించ గలిగితే–

పరం : ఆఁ...నీకేమన్నా పిచ్చా యేమిటమ్మా – కలలో కూడా వాడ్ని క్షమించడు బావ. బావ సంగతి నన్న డుగు. నే చెప్తాను. ఆనాడు నువ్వు, రఘు, వాడు – పతి యింతమంది గోలపెడ్తున్నా ఆగాడూ ?

లలిత : (కోపంతో) అదేమిటన్నయ్యా ? – ఆయన సంగతి నాకు బాగా తెలుసు. క్షమించరూ? – అసలు వాడ్ని క్షమించేదేమిటి ? రక్తంలో రక్తం – ప్రాణంలో ప్రాణం వాడు. కోపంలో అప్పుడు అరిచారేగాని వాడిమీద ప్రేమలేదనా ? – ఆ బాధతోనే చివరి వరకూ కుమిలిపోయేవారు. అభిమానం అడ్డొచ్చి పైకి చెప్పలేకపోయేవారు.

పరం : ఏంచేస్తాం చెప్పు ? అంతా—

(పిల్ల కేరుతుంది. పరంధామయ్య అటుచూశాడు. లీలా యిది గమనించి లేచి ఉయ్యాల ఊపబోయాడు. ఉయ్యాల సైడ్ కర్టెన్‌లో ఉంటుంది. ఊపుతున్నప్పుడు ఒక భాగం మాత్రం కన్పిస్తుంది. అంతే.)

ఈ పిల్లదికూడా అచ్చు వాళ్ళ నాన్నపోలికేనమ్మా. (పిల్ల ఏడుపుఆగింది) వాడిలాగే కీచంటపడిపోయి వేరులా ఎండిపోయింది. కాని, దాన్నేపోలితేనా, యీపాటికి దబ్బపండులాగ యింతుండదూ?–

లలిత : ఉక్కపోస్తోందేమిటో నన్నయ్యా దానికీమధ్య బాగుండలేదు.

పరం : ( తొట్టిదగ్గర కూచుని ఊపుతున్నాడు ) చిన్నప్పుడు వాడూ అంతేగా ? – నిజానికి వాళ్ళిద్దరికీ పెళ్ళిచేయడం తప్పయిపోయిందమ్మా. వద్దు మొర్రో అని ఓపక్క కుర్రదానితో అంటూనే ఉన్నాను. కాని వాడికవిత్వం పిచ్చిలోపడి యిదనన్నా అటకాయిస్తాండేది ?...

(నీలూ ఒక్కసారిగా మావయ్య రెండుబుజాలూ పట్టుకుని మెడ మీద ఎక్కేశాడు.)

౹రం : ఒరే, చచ్చాన్రా చిన్నా? - వీడు ... వీడున్నాడే- వాళ్ళన్నయ్యగురించి మాట్లాడితే వూరుకోడు. నోరె త్తితేచాలు, కనిపెట్టి నామీద స్వారీచేసేస్తాడు, మూగి భడవ ! - ఒరే, దిగరా - మీ అన్నయ్యనేమీ అనన్లే - నేరకపోయి అన్నాను. (లలితమ్మ నవ్వు తుంది. నీలూ నవ్వుతూ దిగిపోయేడు) నన్నడిగితే - దానికితగిన మొగుడెవరో ఎరుగుదువా ? - ముమ్మూ ర్తులా శేషే దానికి తగిన మొగుడు.

౹లిత : ఇష్. రాధవస్తోంది.

(ఇద్దరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు. రాధ వచ్చింది. తొట్టి దగ్గరకుపోయి పిల్లని ఊపుతోంది. నమఃబిగించిన కొంగు సవరించు కొని...)

రాధ : అబ్బబ్బ! ఎండ యిలా నిప్పులుచెరుగుతోంది. ఉస్. (కొంగుతో విసురుకొంటూ) ఆ వంటిల్లు మరీనూ ?

౹లిత : (తలెత్తి) నన్ను పిలవకపోయావా అమ్మా.

రాధ : నువ్వాసలే తట్టుకోలేవు ఆ వేడికి. (ఉయ్యాల ఊపు తుంది.)

పరం : అయినా వీళ్ళ కాపరాలేమిటమ్మా - ఇట్లా విసు గుల్తో,కోపతాపాల్తో బ్రతికేవాళ్ళమా మా కాలంలో. బ్రతకడం తెలీకపోతే అన్నీ ఆటంకాలే!

రాధ : నువ్వూరుకోనాన్నా-అసలే పనివలన బాధల్తో నలిగి పోతూంటే నువ్వు మరీనూ. పుస్తకాలున్న టేబిలు దగ్గరికి వెళ్ళి దొంతరపెట్తుంది.)

పరం : బాధలనుకుంటే అన్నీ బాధలే. వేగంగా వస్తేనేకాని తిండి పెట్టనని మొగుణ్ని అదిలించలేవు. "హమ్మో! మొగుడే? ఎలా ఎదురుచెప్పడం" అంటావు. ఇంక కుర్రదానిమీదా, నామీదా విసుక్కుంటావు. నీ మంచితనమే నీకు పనికిరాదమ్మా. నేనెప్పుడూ చెప్తున్నా నీమాట.

రాధ : అబ్బ! నీగోల ఆపునాన్నా! - (కొంగుతో చెమట కారిన నుదుటిని ఆయాసంతో తుడుచుకొని) ఉష్! అసలే వేడి ప్రాణం తీసేస్తోంది, ఇలా సాధింపులు కాకపోతే ఏవో కబుర్లు చెప్పకూడదూ! - (ఈ లోగా నీలూ పలకమీద ఏదోరాసి వదినెకి చూపించాడు. చదవగానే ఆమె ముఖం వికసించింది. తలెత్తి) నిజంగా! (అడిగింది నీలూని. వాడుతలూపాడు)

రాధ : బావ ఎప్పుడు వస్తున్నాడత్తయ్యా?

లలి : ఏం?

రాధ : నీలూ అంటున్నాడు, అన్నయ్య వస్తున్నాడని.

పరం : చూశావ్, చూశావా వాడి తెలివి తేటలు.

లలిత : అదే; కలకత్తానుంచి బయలుదేరాడని ప్రొద్దుట వాడు చెప్పలేదూ?

రాధ : అదా? ఊళ్లోకి వచ్చాడేమో ననుకున్నాను. ఏ క్షణాన్నయినా రావచ్చనా్నరాయన.

పరం : వస్తాడులే. బయల్దేరినవాడు రాకుండా పోతాడా ?

రాధ : అతనొస్తే పొలంకాస్త నయమవుతుంది.

పరం : ఆఁ...పొలమూ నయమవుతుంది, మనుషులూ నయమవుతారు యిప్పటి పరిస్థితుల్ని బట్టి.

రాధ : (విసుగ్గా) అదిగో మళ్ళీ పరిస్థితులు బాగాలేవని మా అందరికీ తెల్సు. నువ్ మాటిమాటికీ గుర్తుచేసి మమ్మల్ని ఎత్తి పొడవనక్కరలేదు.

పరం : ( ఆమాట పట్టించుకోకుండా) విన్నావా లలితమ్మా. పరిస్థితులు అధ్వాన్నంగా వున్నాయన్నాను.అంతేనా? ఇప్పుడు విను దీనిమాటలు ... (అంతలోనే నిరసన ప్రదర్శిస్తూ)సరేలే, నాకూతురుకే నేను నచ్చచెప్పలేక పోయాను. ఎవరయినా మటుకు నామాట ఎందుకు వినాలి?

రాధ : (రెండు చేతుల్తో చెవులు మూసుకు) నాన్నా!

లలిత : పరవాలేదన్నయ్యా, శేషు అన్నిపనులూ చక్కబెడతాడు.

రాధ : అవును. బావవిషయం నాకు బాగా తెల్సు. ఏం చేసినా అతనికే తగింది. (అంతలో జుగుప్సతో) అంతదూరంనుంచి వచ్చిన అతనిమీద మళ్ళీ యీ బరువంతా వేయడానికి మనమే సిగ్గుపడాలి......

(కాస్సేపు ఏదో ఆలోచిస్తూండిపోయింది. అంతలో పేలవంగా నవ్వింది) నిజానికి యిందులో యీాయన తప్పుకూడా లేదు. ఇంతకంటె ఏం చేస్తారు? – ఓ పక్క–నుంచి రాత్రీ పగలూ కష్టపడుతున్నాడు కూడాను. ,

పరం : (నిర్లక్ష్యంగా) సరి. పీడికష్టానికేంలే. (రాధ భ్రుకటి ముడుతపడింది) చూస్తూనే వున్నాంగా, భోజనం చెయ్యడానికీ, గాలి పీల్చడానికీ నేను కష్టపడడం లేదూ ? (ఆమె ముఖంచూసి భయపడి) మరి మాట్లాడనులే రాఅమ్మా – లలితమ్మా అలా చెట్టునీడకి పోయి కూచోండాం. ఇంతగాలన్నా వేస్తుంది. (రాధతో) నువ్వూవస్తేరా అలాగ... ...గాలితగిల్తే వంటికి మంచిది.

రాధ : ఇప్పుడు రానులే నువ్వువెళ్లు. ఇంకా దీన్ని పడుకో బెట్టాలి.

పరం : (వెళ్తూ) వాడికి గట్టిగా చెప్పు, రోజూ యిలా ఆలశ్యంగా రావడానికి వీల్లేదని. మరీ తెలివితక్కువగా కూచోకు.

రాధ : చెప్పినమాట లక్ష్యం చేస్తేకదూ చెప్పడానికి.

పరం : సరే. నీయిష్టం. పదమ్మా.

(లలిత, పరంధామయ్య బయటికి వెళ్ళారు. రాధ ఉయ్యాల ఊపుతూనే అంతలో ఏదోతోచి లోపలికి వెళ్ళి దువ్వెనతెచ్చి నీలూని పిట్టగోడ మీద కూర్చోబెట్టి తలదువ్వుతుంది. దువ్వుతూనే మాట్లాడుతుంది.)

రాధ : అయితే నీలూ! అన్నయ్య ఎప్పుడొస్తాడని చెప్పారు?

నీలూ : (చెప్పనని తలూపాడు)

రాధ : పోనీలే, చెప్పకపోతే నీ జట్టుండను.

నీలూ : ('ఇవాళ' అని పలకమీద రాశాడు.)

రాధ : (చదివి) యివాళే! మరి వుత్తరంలో...

(వాణ్ణి వదిలి టేబిల్ మీదనుంచి ఉత్తరం ఒకటితీసి చదువుతూంటుంది. క్లాస్సేపటికి రఘూవచ్చాడు. నీరసంగా వున్నాడు. అతని కూడా వయస్సు ముదిరింది. ఏదో బరువుమోస్తున్నట్లు బుజాలు దిగజారాయి ముఖం నల్లబడింది. ఎన్నాళ్లనుంచో గెడ్డంచేసుకోలేదేమో మరీ అసహ్యంగా కన్పిస్తున్నాడు. మట్టితో, చెమటతో ముఖం, వొళ్లూ మరకలు కట్టింది. ఎండిన పెదవుల్ని మాటిమాటికీ తడిచేసుకోవడం అలవాటయింది. కళ్ళల్లో ఓ విధమయిన భయం, పిరికితనం— ఎప్పుడూను. ఈ మూడేళ్లూ అతణ్ణి మరీ ముసిలివాణ్ణి చేశాయి. వస్తూనే Right side కుర్చీలో కూర్చొని ఆయాసపడ్డాడు)

రఘు : అబ్బ! వొళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ పాకుతున్నట్టుంది.

(ఉత్తరం చదువుతున్న రాధ నిశ్చేష్టురాలయింది, మొదట ఉత్తరాన్ని దాచడానికి శతవిధాలా ప్రయత్నం చేసింది. తర్వాత ఏమాలోంచిందో ఉత్తరాన్ని ధైర్యంగా, నిర్భయంగా పట్టుకునే కూచుంది. తలెత్తి మెల్లగా లేస్తూ—

రాధ : మాకూ అలాగేవుంది.

రఘు : (ఇప్పుడు చూశాడామెను) రాధా! నువ్విక్కడే వున్నావా?— (భోజనం ఏర్పాట్లు చూశాడు) నువ్వింకా భోజనం చెయ్యలా? (బుజంమీద చెయ్యేసి ఆమె మాసినబట్టల్ని చూస్తూ) ఏమిటివాళ? రాణీగారు కొత్తవేషం వేశారు?

రాధ : (ఉదాసీనతతో) వేషం ? - యీ పనుల్తో యిక్క డంతా మాడిచస్తూంటే మీకు వేషాలూ, రాజులూ కన్పిస్తున్నారు. నా మొహానికి వేషంకూడానూ— వేషం !—

(లలితమ్మ దారపుఉండ మరిచిపోయి లోపలికి వచ్చింది. కొడుకుని చూసి)

లలిత : భోజనం చేశావురా నాన్నా !

రఘు : (నిస్పృహతో రాధమాటల్తో సగం కృంగిపోయాడు) లేదమ్మా ! యిప్పుడే వచ్చాను.

లలిత : అయితే కాళ్ళు కడుక్కూరా వేగిరం - యింతవేళ వరకూ ఎండలో తిరిగితే వొళ్లు పాడవదురా ? లేలే, వేగం భోజనంచేసి కాస్సేపు పడుకో (దారపుఉండ తీసుకు వెళ్ళిపోయింది)

(నిస్సహాయతతో రాధ వేపు చూశాడు రఘు. "అ మాత్రం సానుభూతి నువ్వు చూపలేక పోయావే" అన్న బాధతో, గ్రహించి, ఆమె అతని ముఖం చూడడంలేదు. అ సంఘటనకి సిగ్గుకంటె ఓర్వలేనితనం గురించి ఉదాసీనత కెచ్చింది.)

రఘు : (బల్లమీద విసినకర్ర తీసుకొని విసురుకొంటూ) అబ్బ ! యివాళ మరీ చికాకుగావుంది.

రాధ : (వ్యంగ్యం స్ఫురించడంతో కోపం వచ్చింది) మాకూ అలాగే వుంది.

రఘు : (విషయం గ్రహించి, నిర్లిప్తంగా) అవును ! - నేను భోజనం చెయ్యకపోతే ఎవరికి బాధ !

రాధ : (వెంటనే జవాబు వచ్చింది) మీకు తెలీదూ ఎవరికి బాధో!- ఎవరికి బాధ?-...మిమ్మల్ని కట్టుకున్న నాకుంటుంది. కన్నతల్లి కుంటుంది. ఎవరికో ఎందు కుంటుంది ?

రఘు : (కూచుని తన చేతకానితనాన్ని తనే హేళన చేసు కుంటున్నట్టు నవ్వి) అయితే నాకు తెలీకుండానే నేను చాలామందిని బాధపెట్టున్నాననన్నమాట ?

రాధ : ఆలోచిస్తే మీకే అర్థమవుతుంది.

రఘు : (ఏమీ చెప్పలేక Struggle అయి) క్షమించు.

రాధ : సరే, లేవండి.

(సీలూ వీధిలోంచి వచ్చి అన్నయ్యను చూసి వెంటనే లోపలికి వెళ్ళాడు)

రఘు : సీలూ భోజనం చేశాడా ?

రాధ : మీరు తినందే తినకూడదని శపథం-మీతమ్ముడేగా?

రఘు : నువ్వు భోజనం చేసెయ్యలేక పోయావా, నాలుగు రోజులవరకూ యిలాగే రాక తప్పదు- ఓ మిషను...

రాధ : (కోపంతో ఉక్కిరి బిక్కిరయి) ఇవతలవాళ్లు చస్తున్నా సరేనా ?-.

రఘు : (ఆశ్చర్యంతో) రాధా !

రాధ : (ముఖం పక్కకి తిప్పుకొని పిట్టగోడ దగ్గరికి వెళ్లి) మమ్మల్నెందుకిలా ఏడిపిస్తారు ?

రఘు : (ఇలాంటి సంభాషణ అంతకుముందు ఎప్పుడూ జరగ లేదు. అందుకని ఆమె ప్రతీమాట ఆశ్చర్య పరు స్తోంది) నేనేడిపించానా ?

రాధ : (విసురుగా) కుర్రాళ్ళలాగ అడుగుతా కేం ? నలుగురికీ నేను సమాధానం చెప్పలేక చస్తున్నాను.

(ఈ లోగా నీలూ చెంబుతో నీళ్లు తెచ్చి అన్నయ్య ముందు నిల బడ్డాడు. చూసి ఆశ్చర్యపోయాడు రఘూ. సాభిప్రాయంగా రాధను చూశాడు. తను చెయ్యని పనిని కుర్రాడు చేశాడన్న Spite కదిలింది రాధకళ్ళలో)

రఘు : (నీళ్ళు అందుకుని నీలూ భుజంమీద చెయ్యేసి) అరేయ్ నీలూ ! నీళ్లు తెమ్మని ఎవరు చెప్పార్రా నీకు ?

(నవ్వి ఊరుకున్నాడు)

(రఘూ వెళ్లి కాళ్ళు కడుక్కొని వచ్చాడు. నీలూ తువాలు అందిం చాడు)

రఘు : (కాళ్లు తుడుచుకొంటూ) నువ్వురా నాకు తగిన వాడివి-

రాధ : (మనస్సు భగ్గుమంది) ఇంక వాడిన్ని పొగుడుతూ కూచోండి. తిండీ తిప్పలూ ఏమీ అక్కరలేదు.

రఘు : ఎందుకలా కసురుకొంటావ్ ? వస్తున్నాగా (ఉయ్యాల కదిపి) కమల నిద్రపోయినట్టుందే ! - ఎలావుంది దాని వంట్లో (జవాబు రాకపోయేసరికి వెనక్కి తిరిగాడు. రాధ లేదు. లోపలకు వెళ్ళింది. టేబిలుమీద శేషు ఉత్తరం తీసి చదువుతున్నాడు. రాధవచ్చి ఉత్ర్చేతి

మీద ఉన్న తువాలుతీసి వంటింట్లోకి వెళ్తూండగా)
అన్నయ్య రాసిన ఉత్తరమేనా ?– (రాధమాట్లాడదు)
నాకు తెల్సు, ఈపాటికి ఉత్తరమంతా నీకు కంఠో
పాఠం అయివుండాలే !

రాధ : (ఊహించని హేళనకి, వ్యంగ్యానికి రాధ తుళ్ళిపడ్డది. అంతలో ఉదాసీనత కంఠాన్ని ఉద్విగ్నం చేసింది.) నాకు మాత్రం చదవడానికి హక్కులేదా యేమిటి ? ఉత్తరం అందరికోసం రాశాడతను.

రఘు : (చికాకుపడి) తెలివితక్కువగా మాట్లాడకు. ఇందులో హక్కేమిటి ? ఇన్నిసార్లు చదివావు ఉత్తరం గుర్తుందా లేదా అని అడిగాను అంతే.

రాధ : (హేళనగా) మంచిపని చేశారు. భోజనానికి పదండి.

రఘు : (హేళనకి మనస్సు చివుక్కుమంది) ఆకలిగాలేదు. ఇప్పుడేం భోజనం చెయ్యను.

రాధ : మీ కోసమే యింతవరకు కూచొన్నా న్నేను.

రఘు : సరే. అదేదో యిక్కడికే తెచ్చిపడెయ్. నాలుగు మెతుకులు తినిపోతాను.

రాధ : (వంటింటివేపు వెళ్తూ) ఏం ? యివాళ కొత్తఅలవా టేమిటి కుర్చీలో భోజనం చేయడం ?

రఘు : ఎండలోవచ్చాక ఆ గదిలో కూచోవాలంటే చికాకు.

రాధ : ఇవతలవాళ్ళకీ అలాగే వుంటుందని ఎందు కనుకో కూడదు ?

(లోపలకు వెళ్ళింది. మాటలకి ఆశ్చర్యపోతూ ఆమె వెళ్ళినవేపు ఆశ్చర్యంగా చూస్తాడు. టేబిలుదగ్గరకువెళ్లి పుస్తకం తెచ్చుకుంటాడు. నీలూదగ్గరికి వచ్చాడు.)

నీలూ : (సంజ్ఞతో అడిగాడు) ఎందుకాలస్యమయింది?

రఘు : ఏం లేదులే. ఓ మిషనుపాడయింది, నాకేమీ రాదా? ఎలాగో బాధలుపడి చేస్తున్నాను, పాఠాలు చదువు తున్నావా?

నీలూ : (తలూపాడు) అన్నయ్యా ఎప్పుడు వస్తాడు (సంజ్ఞ చేశాడు)

రఘు : వచ్చేస్తాడు ఇవాళో, రేపో...

(సంజ్ఞతో చెప్పాడు ...పుస్తకం చదువుతున్నాడు. నీలూ వ్రాసుకుంటున్నాడు. రాధ కాస్సేపటికి భోజనం కంచంలో తెచ్చి టేబిలు మీద వుంచింది. రఘు చదువుకొంటున్నాడు. ఇదేం గమనించలేదు.)

రాధ : (ఒక్క క్షణం అతణ్ని కోపంతో చూస్తూనిలబడింది దగ్గరికివచ్చి బయటికి చూస్తూ అంది.) ఆ పాడు చెత్తని అక్కడపడేసి భోజనం కానీయండి. చల్లారి పోతుంది.

రఘు : (పుస్తకంమూసి) తెచ్చావా రాధా! - చూడనే లేదు.

(టేబిలుదగ్గరికివచ్చి కూచున్నాడు. ఆకలిలేకపోయినా భోజనానికి ఉపక్రమించబోయాడు. ఇంతలో రాధ మెల్లగా ప్రారంభించింది)

రాధ : నే నంటే మీకు మరీ నిర్లక్ష్యంగా వుంది. ఎన్ని సార్లు చెప్పాను, కాస్త పెందలాడే భోజనానికి రమ్మని?

రఘు : ఇవాళ మరీ వీలుకాలేదు – క్షమించు రాధా!

రాధ : అదొకటి బాగా అలవాటయింది. ఏదీతోచకపోతే క్షమించ మనటం.

రఘు : ఏంచెయ్యను చెప్పు? – రోజూ వేగంగా రావాలనే అనుకుంటాను. కాని ఏదో పని అడ్డు తగుల్తూంటుంది.

రాధ : అనుకోడానికీ, జరగడానికి చాలా తేడావుంది.

రఘు : అయితే నన్ను తిట్టు. నీయిష్టం వచ్చినట్టుచెయ్. సరా?

రాధ : (దిమ్మరపోయి) ఊఁ కొత్తమాటలు చాలా నేర్చుకున్నారే!

రఘు : అవునురాధా, నాగురించి ఎదురుచూడకీసారి. ఆబల్ల మీద నా భోజనం పడేయ్.

రాధ : చెప్పడం సులువే. మిగతా పనెవరు చేస్తారు, మీరు భోజనం చేశాక?

రఘు : అదీ నేనే చేస్తాలే.

రాధ : అప్పుడిక వ్యవహారం మరీబావుంటుంది. పుస్తకాలు చదువుకొంటూ, చల్లారిన మెతుకులు నముల్తూ కూర్చుందురుగాని.

రఘు : ఇదే కాస్తనయం. మనం, మన మనస్సులు చల్లారలేకపోతున్నా, యిదయినా చల్లారగలుగుతోంది.

(రాధ ఏమీ మాట్లాడలేదు. పుస్తకం చదువుతూనే అన్నం తినబోతాడు.)

రాధ : పుస్తకం చదువుతూనే భోజనం చెయ్యాలేవిటి ?— చదువు ఉపయోగం అర్థమవుతోందిగా ?

రఘు : (చటుక్కున పుస్తకాన్ని మూస్తూ, విసుగుతో) ఎప్పుడూ పుస్తకం, పుస్తకం అని సాధిస్తావేం నన్ను? వాటివల్ల వచ్చే ఆకాస్త సరదాఅయినా పొంద నియ్యవేం నన్ను ?— వాటిలో ... (ఆగిపోయాడు.)

రాధ : ఊఁ - అనండి. వాటిలో విషయాల్ని తెలుసుకో లేనిదాన్ని, చదువురానిదాన్ని నేను దాపురించాను మీకు. ఏదో పిచ్చిగా వాగుతుంటాను ...

రఘు : (సిగ్గుపడి) అలా అన్నానా నేను? నేను అననిమాటలు కూడ ఊహించుకు సాధిస్తే నేనేం చేసేది ?

రాధ : మిమ్మలెన్నవ్వరూ సాధించలేదు—

రఘు : పోనీ, నేనే వాగుతున్నాను. అబ్బబ్బబ్బ ! ప్రతిదానికీ పెడర్థాలు తీయడం నీ కలవాటయిపోయింది. ఓ పక్క ఈ వెధవపాలం నాప్రాణం కొరికేస్తోంది.

రాధ : పాపం ! ఏం చేస్తారు ? ఆపని మీదికాదాయెను. (వ్యంగ్యంగా)

రఘు : అవును, నిజమే. నే నెప్పుడన్నా చేసిచస్తేగా ? - పని చేసిచేసి నా ప్రాణం విసిగిపోతోంది. అంతా దుర దృష్టం.

రాధ : దురదృష్టమేనా ?

రఘు : నా చేతకానితనమూను. అంతేనా నువ్వు వప్పుకో మనేది ? - (కాస్సేపాగి - మెల్లగా) కాని దురదృ

ష్టంకూడా వుంది-(హఠాత్తుగా burst అయి) అవును. నువ్వెప్పుడూ అలా ఎడముఖంగా వుంటావేం? ఎప్పుడూ విసుగూ, సాధింపులూ యింట్లో... ఛీఛీ !- నేను మాత్రం నే చెయ్యగలిగినంత చేస్తూనే వున్నాను.

రాధ : అక్కడికి నేనేనా తీరుబాటుగా కూర్చున్నాను?

రఘు : అదిగో మళ్ళీ. నన్నిలా మాటల్తో చంపెయ్యకు.

(పాప రబ్బరుగుడ్డ తీసుకొని రఘూ మాట్లాడుతూండగానే లోపలికి వెళ్ళిపోయింది. రఘూ యిది గమనించలేదు. రాధను చూడకుండానే)

రఘు : ఇప్పటికే అన్నివిధాలా కృంగిపోయాను నేను. ఇద్దరం కలిసి పరిస్థితుల్ని బాగుపరుచుకుందాం. నాలో తప్పులున్నా అప్పుడప్పుడు నన్ను ప్రోత్సహిస్తేచాలు. మనస్సుకి శాంతికలిగించే రెండు మాటలు - అవీ నాక్కావాలి -

(తల్లివచ్చింది. రఘు చెప్తున్నమాటలు వింటూ ఆమె దిగ్భ్రమ చెందింది. అంతలో కళ్లు చెమర్చాయి.)

నీనుంచి ఆమాత్రం పొందలేనూ నేను? నాన్న పోయిన దగ్గర్నుంచి నేనెన్ని విధాల చెడిపోయానో నీకు తెల్సు. నాకీ పాలంపని రాదు. ఎప్పుడూ ఈపని లోకి వస్తాననుకోలేదు. కాని నాదౌర్భాగ్యం - పుట్టు కలోనే యీ చేతకాని తనం నావంట్లో ప్రవేశిం చింది. ఎందుకూ పనికిరాని వెధవన్నేను...

(యిటుతిరిగే సరిక్కతల్లి కనిపించింది. ఒక్కసారి ఆమె ముఖంలోకి చూశాడు. దుఃఖం వెల్లుబికింది రెండుచేతుల్తో ముఖం కప్పుకు

ఏడ్చాడు. తల్లి స్తబ్దురాలయి, కన్నీరు తుడుచుకు అతని దగ్గరికి వచ్చింది-అస్పష్టంగా పిలిచాడు) అమ్మా !

లలిత : (గొంతులో జీర అడ్డుపడుతుంది. మాట రావడం లేదు)

(రాధ యీ సరికి తలుపుదగ్గరికి వచ్చి ఆగిపోయింది.)

రఘు : నన్నెందుకు కన్నావమ్మా ?- ఎవరికీ ఉపయోగం లేదు నావల్ల... (ఏడుస్తూ తల్లి చేతుల్లో ముఖం కప్పుకున్నాడు.)

(రాధ నివ్వెరపోయింది. ఒక విధమయిన అసూయతో వొళ్ళంతా గగుర్పాటు చెందింది. ఒక క్షణంలో తేరుకొని మాటలో మనస్సును వ్యక్తంచేస్తూ అంది.)

రాధ : ఇక భోజనం ఏమీ అక్కర్లేదు! అలా తల్లి ఒడిలో నిద్రపోండి.

(తల్లి, రఘూ - యిద్దరూ క్షణకాలం ఆమెను చూస్తూండిపోయారు నిశ్చలంగా. ఇద్దరి ముఖాల్లో నిర్లిప్తత. తల్లిలోని ఆనిశ్చలత కొడుక్కీ వచ్చింది. ఆమె లేచి మెల్లగా వెళ్లిపోయింది. రఘూ కళ్ళు తుడుచుకు లేచాడు. టేబిల్ దగ్గరకు వచ్చి కూచొన్నాడు. భోజనం ముట్టుకోలేదు. పుస్తకం తీయలేదు. నిశ్చలంగా కూచొని ఏదో ఆలోచిస్తున్నాడు.)

రాధ : ఇలా నన్ను నలుగురిలోను తలవంచుకునేట్టు చేయండి. బావుంటుంది.

రఘు : నేనేంచేసేను !

రాధ : లేకపోతే ఆ పనులేమిటి !- చిన్న పిల్లలా ఏం, తల్లి వొళ్ళో తలపెట్టుకు ఏడవడానికి !

రఘు : తల్లిదగ్గర కూచోవడం తప్పా !

రాధ : మీతో వాదించడం నాదే బుద్ధి తక్కువ. ఇప్పటి కన్నా భోజనం చేయండి, మీకు పుణ్యముంటుంది.

రఘు: ఆకలిలేని భోజనం ఎందుకు? (గొణుగుతూ ముద్ద ఎత్తుకోబోతాడు. ఇంతలో బయట ఎవరో తలుపు తట్టారు. ఆగిపోయేడు. రాధలేచి వెళ్తుంది.)

రాధ : (తిరిగివచ్చి) రంగయ్య వచ్చాడు. (లోపలికి వెళ్ళింది.)

రఘు : ఇప్పుడెందుకు వచ్చాడు ? – (గట్టిగా) రంగయ్యా – (బరువుగా, బొద్దుగా ఉన్నమనిషి లోపలికి వచ్చాడు, ఎఱ్ఱటి పాగా, మొణుకులవరకూ ఎత్తికట్టిన వంగపువ్వు రంగు పంచె, బనీనూ, చెవులకి పోగులూ, పొలంలో పనిచేసే మోటుమనిషిలావున్నాడు.) ఏం, యిలా వచ్చావ్ ?

రంగ : కోతబండి స్క్రూ యిరిగిపోనాది.

రఘు : విరిగి పోయిందా ? నేను వచ్చేసరికి బాగానేవుందే ?

రంగ : మీరెల్లాక నడపమోతే యిరిగుందండి.

రఘు : ఇప్పుడెలా? పనంతా ఆగిపోతుంది. గురవయ్య బాగు చెయ్యలేడూ దాన్ని ?

రంగ : ఇంకది బాగుపడేదేటండి ముక్కలయిపోతేనూ ?

రఘు : సరేపద, నేవచ్చి చూస్తాను.

రంగ : సూత్తేసూడండి. నే పోతానండి.

రఘు : పోతున్నావా ? ఎక్కడికి !

రంగ : పని మానేత్తానండి. నాకక్కర్లేదు బాబు. ఈనెల డబ్బు లిత్తే పోతానండి.

రఘు : ఎందుకని ? నీకేమయినా అన్యాయం చేశానా నేను?

రంగ : అదికాదండీ.

రఘు : మరి ?

రంగ : ఏళాకోళం సేత్తే ఎవరు సయిత్తారండి ?– సీత్తెరీ ! అంచేతే ఎళ్తున్నానండి. లచ్చయ్యగారి పొలంలో నవుకరీ దొరికిందండి.

రఘు : వేళాకోళం చేశారా ? – ఎవరు చేశారు ? – నేనా ?

రంగ : మీరుకాదండి. అక్కడి ఎదవనాయాళ్లంతానండి. పొద్దుట పొలం గట్టుమీంచి పోతావుంటే ఆళ్లంతా ఒకటే యికయికలండి. లచ్చయ్యగారి పోలాయ్, గోయిందయ్య, పంతులుగారి సింగడు, గౌరివిశెట్టిగారి చిన్నా, – యీళ్లంతానండి.

రఘు : లక్ష్మయ్యగారి దగ్గర పనిచేస్తే నవ్వారా యేమిటి వాళ్లు ?

రంగ : కోపం రాదంటే ఒక్కటి సెప్తాబాబు. మీ పొలంలో పనిచేసేకంటె కాళ్లు ముడుసుక్కూకోడం నయం బాబు. సింగడూ, పోలాయ్ అంతా మీ కాడనుంచి పోయినోళ్లే గదంటండీ ? – సింగ డానాడు కట్ట తెగేత్తే మీరేం సేసినారండి? నే తన్నబోతే నన్నా

కట్టిపడేశారు. అప్పటినుండికి. శేషుబాబుంటే మకెక్కు లేరగదన్నేవాడు. సరేలెండి. మీ కెందుకు లెండి యీ నాసిరకం పొలంపని చదువుకున్నోళ్ళకి. వత్తా బాబూ—నా డబ్బు లిప్పించండి పనిమానేత్తా.

రఘు : సరే. నీయిష్టం. రేపు పట్నంవెళ్ళి వచ్చాక నీ డబ్బు నీ కిచ్చేస్తాను. అంతకు ముందుమాత్రం నాతరం కాదు.

రంగ : సరేలెండి. అప్పుడు కనిపిత్తా. (వెళ్ళాడు)

(రాధ స్నానంగా తలుపు వేసి వచ్చింది)

రఘు : (తేరుకుని) వెధవది మంకుపట్టు. చెబితే అర్థంకాదు. చూశావా రాధా! అన్నిటికీ తోడు యిదో కష్టం. ఇప్పుడిది నేను కొనితెచ్చుకున్నాననంటావా?

రాధ : (ఆ ప్రశ్నకు సమాధానం చెప్పదు - ఉదాసీనంగా) చివరగా వాడన్నమాట విన్నారుగా? –ఇంకొకరితో అయితే వాడిలా మాట్లాడ గలిగే వాడేనా? (టేబిలుమీద శేషుఉత్తరం చూస్తూ) ఇప్పటికన్నా బావ తిరిగివస్తున్నాడు. కాస్తనయం.

రఘు : (మనస్సు చివుక్కుమంది. అయినా తమాయించు కున్నాడు) నిజమే వాడొస్తే అన్నీ చక్కబెడతాడు. కాని యిన్ని తిరిగొచ్చాక వాడింకా యీ పొలం లోనే కూర్చుంటాడా అని నా అనుమానం.

రాధ : (నిశ్చయంగా) అతను మీలాకాడు. పొలం అంటే ప్రాణం అతనికి.

రఘు : (ఆమాటలు వినలేదు. ఏదో ఆలోచనల్లో పడ్డాడు) అబ్బ! ఈపాటికి ఎన్నో చూసి ఉంటాడు. ఎన్నో కొత్త విషయాలు— నేను తెల్సుకోవాలనుకొన్న వన్నీను...

రాధ : (తీవ్రంగా) నే వెళ్ళలేక పోయానే అని యిప్పు డని పిస్తోంది కాబోలు ?

రఘు : (ఆమె మాటలు విన్పించలే దతనికి — తన కలలే యింకా tickle చేస్తున్నాయి మనస్సుని.) ఆరోజుల్లో యీ కొండల్ని దాటిపోవాలని ఎంత కోరికగా వుండేది! అప్పటి ఆలోచనలు, కలలు, ఏవో పిలుపులు...

(దూరాన సన్నగా, విధివశ్శమైన జీవితపు చివరిమూలుగులాగ — గొంతు—)

నీలిమాకాశాన
నీలి నీడలు మేము—
కొండశిఖరాన మా
గుండెకదలిక మెయిలు
మముదాటి పోయేటి
మమత నీకేల నిటు
మరలి రమ్మిక మనసు
మరులు గొలిపెద మేము—

ప్రియతమా॥

రఘు : (అంతలో నిస్పృహ) ఛీ! ఏం బతుకు? - ఇప్పుడు వాటినిచూసి అసహ్య పడడం అలవాటయింది. వీటన్నిటి మధ్యజైల్లోపడ్డ ఖైదీలాగ యీఎత్తుపల్లాల్లో కొట్టుకు పోవడం మిగిలింది. ఆ కలలూ, ఆ ఆనందం అంతా నాకు తెలీకుండానే మాయమయాయి. (యిటువేపు తిరిగి రాధని గమనిస్తూ) ఒక్కొక్క ప్పుడు నాకనిపిస్తూంటుంది రాధా! నీ కోసం, యీ కమలకోసం కాకపోతే యీ బంధాలన్నీ వదులుకుని యీ రోడ్డువెంబడే అలా ఎక్కడికో నడిచిపోవా లని పిస్తుంది. అదో విధమైన స్వేచ్ఛ, ఆనందం కావాలి నాకు... మళ్ళీ కలలు కంటున్నాను. ఎప్పుడూ తీరని దౌర్భాగ్యపు కలలు...

రాధ : (మెల్లగా, విసుగెత్తిన కంఠంతో) మీరొకరేకాదు, నేనూను.

రఘు : (తన ఆలోచనల్లోనే సతమతమవుతూ) - శేషు వెళ్లాడు - ఏం బావుకున్నాడు? వాడి ఉత్తరాలు పొలంలో పనిచేసేవాడు రాసినట్లుగానే వున్నాయి.

రాధ : (కోపంతో కంఠం వణికింది) మీరతన్నేమీ వేళా కోళం చెయ్యనక్కర్లేదు లెండి.

రఘు : మాటవరసకి అంటున్నానంతే. అనుకున్నా ఏంప్రయో జనం ఉండదనుకో. వాడి మనస్తత్వం అది. వాడిని తిడుతున్నాననా?— నిజం చెప్పాల్సివస్తే నేను

ప్రేమించినంతగా వాడి నెవరూ ప్రేమించ లేదనుకుం టాను. అయితే వాడి తరహా అది-అదో చిన్నతనం.

రాధ: (కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి) అదిగో మళ్ళీ. దగ్గర లేని వాళ్లని మాటలనడానికి సిగ్గు వేయదేం మీకు? మీరు మాత్రం యిక్కడ కూచోని చేసిన ఘన కార్యం ఏమిటి?- పొలాన్నంతా దిబ్బ చేసి వదిలి పెట్టారుగా. ఇంత అధ్వాన్నంగా ఎవరూ ఉండరు.

రఘు: (దిగ్భ్రమతో) రాధా!

రాధ: ఏం? అబద్ధమా! - మీరు చేస్తున్న దేవిటి?— మాటలుచెప్పడానికీ, చేతకాలేదని బాధపడడానికీ మీ తర్వాతే- పనిదగ్గరికి వచ్చేసరికి తెలుస్తోందిగా?- మీ అన్నయ్యకూ, మీకు పోలికా! - ఏ విష యంలో? మీకు ఈర్ష్యపడడం, అసహ్యపడడం, తల్లి ఒడిలో పడుకోవడం, ఏడవడం బాగా తెలుసు. కాక పోతే మనిషిని తిట్టడం కూడా తెలుసు. (కోపంతో 'రాధా' అనబోయాడు) లేకపోతే నామీద 'రాధా' అని విరుచుకుపడడం బాగా వచ్చు. అతనంటే అంత ఈర్ష్య ఎందుకంటే మీ అదృష్టాన్ని పుంజుకున్నా డనీ - మీకు లేకుండా చేశాడని. మీరు మాత్రం యీ మురికిలో, యీ రొంపిలో...

రఘు: (నిస్సహాయుడై) రాధా! - చెప్తున్నాను - తర్వాత బాధపడతావు యిప్పుడన్న మాటలకి—

రాధ : (మరీ ఉద్రిక్తురాలయి) బాధపడను. చచ్చినా బాధపడను. తెలిసే అంటున్నాను అన్నీను.

రఘు : (కోపంతో ఉత్తేజితుడయి) రాధా! యిక మాట్లాడకు. (అరిచాడు)

రాధ : మాట్లాడితే ఏం చేస్తారు ? (తెగింపుగా) ఆడవాళ్ళని కొట్టడం కొత్తగా అలవాటు చేసుకుంటారు; కాకపోతే ప్రాణం తీస్తారు అంతేనా ? తీసినా అంటాను. మీలాంటి మనిషితో యిన్నాళ్ళూ ఉండి నేను కాబట్టి బాధలు పడ్డాను. మీ చదువుతో, మీ కవిత్వంతో మిగతా వాళ్ళందరికంటె గొప్పవారయి పోయారనుకుంటున్నారు కాబోలు-(రఘూ నిస్తేజుడై రాయిలా నిలబడి పోయాడు. అతనిలో కోపంలేదు. ఆశ్చర్యం లేదు. దుఃఖం లేదు. కన్నార్పకుండా ఆమె దగ్గర నిలబడి యిద్దర్నీ విచిత్రంగా చూస్తున్నాడు. రాధకి ఉత్తేజంతో పిచ్చెక్కింది) మీలాంటి గొప్పవ్యక్తిని పెళ్ళి చేసుకున్నందుకు నేనెంతో గర్వపడుతున్నాననుకొంటున్నారు కాబోలు !- ఇన్నాళ్ళూ ప్రతిక్షణం నేనెలా బాధ పడ్డానో తెలిస్తే గుండె బద్దలవుతుంది మీకు. మీ చేతకానితనం నన్ను చంపేసింది. ఇద్దరం చచ్చిపోదాం.

రఘు : వద్దు, వద్దు రాధా ! - యిక మాట్లాడకు. నీకు నమస్కారం చేస్తాను. (మధ్యబల్లదగ్గర కూర్చుని బల్లమీద తల ఆనించి మాట్లాడడు.)

రాధ : అబ్బ! - యిదివరకే మీ మనస్సెంత చిన్నదో తెలిసివుంటే - మిమ్మల్ని పెళ్ళి చేసుకునే కంటె ఆత్మ హత్య చేసుకునేదాన్ని - కాని - అంతా అయిపోయాక ... యిప్పుడు ... అంతాపూర్తయాక తెలిసింది, మీరెలాంటి వారో—

రఘు : (కాస్సేపు మాట్లాడలేక పోయాడు) నువ్వెలాంటి దానవో నాకూ తెల్సింది. ఛీ! నీ ముఖం చూస్తేనే పాపం -

రాధ : అనండి, ఎన్నయినా అనండి. ఇప్పుడిక నేను చెడ్డగానే కనిపిస్తాను. ఇల్లు వదిలి పోవాలనుందన్నారుగా? వెళ్ళండి. నన్నుద్ధరించడం కోసం, లోకాన్ని మెప్పించడం కోసం నాతో బ్రతకనక్కర్లేదు. నాకేం బాధ లేదు. (కోపంతో దుఃఖం పొర్లు కొచ్చింది. ఇంతవరకూ ఆ ఛాయలు కన్పించకుండా అడ్డం చేసుకున్న ఉదాసీనత సడలింది.) బావ తిరిగి వస్తున్నాడు. అదిమాత్రం మరిచిపోకండి. మనిషిలో ఎంత సత్తా ఉండాలో అతను చూపిస్తాడు. బావ తిరిగి వస్తున్నాడు.

(ఇద్దరూ స్తబ్ధుగా కొన్నిక్షణాలు నిలబడిపోయారు. అన్నయ్య ప్రసక్తి వచ్చేసరికి రఘు దిగ్భ్రాంతుడయాడు. ఒక్క ఉదుటున ఆమెను రెండు చేతుల్తో పట్టుకున్నాడు.)

రఘు : రాధా! ఏమిటి నువ్వనేది?- మాట్లాడు ... రాక్షసీ! నిన్ను చంపినా పాపం లేదు ...

రాధ : (దుఃఖం ఆగలేదు. ఏడ్చింది.) నే నంటున్నదేమిటో నాకు తెలుసు. తెలిసే నే అంటున్నాను. మీకు

నన్ను చంపినా అదేమాట అంటాను. ముమ్మాటికీ అంటాను—అంటాను. అతనిమీద యీ అభిమానం యిప్పటిది కాదు. ఎన్నటికీ ఆ అభిమానం చావదు. మీకూ తెల్సా విషయం. ఇక వెళ్ళండి. మీ యిష్టం వచ్చిన చోటుకి వెళ్ళండి—

(ఒక్క ఉదుటున ఆమెను తోసేసాడు. మధ్య బల్లని ఆనుకుంది.)

రఘు : ఇవాళ నీ రక్తం కళ్ళ జూస్తాను. నీకూ, నీ పాపాలకీ. యీనాటికి – (ఒక్కసారిగా కుర్చీ ఎత్తుతాడు. భయపడి కెవ్వున కేకవేసి రెండు చేతుల్తో ముఖం కప్పుకుంది రాధ. కన్నా ఒక్క అరుపు అరచి రఘూ కాళ్ళని పెనవేసుకున్నాడు. తల్లి భయంతో గుమ్మం దగ్గరకు వచ్చి ఆగిపోయింది. భీతికంటె, ముఖంలో దైన్యం కన్పిస్తోంది. కుర్చీ ఎత్తే సమయానికి 'రఘూ' అని పిలవబోయింది. కంఠం రుద్ధమయి శబ్దం పగిలింది. ఆ గొంతు రఘూ ఉద్రేకాన్ని చెదరగొట్టింది. విస్తుపోయి తన పరిస్థితికి నిస్సహాయంగా నేలమీద ఏడుస్తున్న రాధ స్థితిని చూసి "ఇలా తిరిగి పోయిందేమిటి?" అని ఆశ్చర్యపోయాడు. రాధకు కూడా తన పని తనకే అసహ్యమనిపించింది. వెనక నిలబడ్డ తల్లిని చూడలేక పోయాడు. ఈలోగా సామాన్లు పట్టుకుని శేషు హడావుడిగా లోపలికి వచ్చాడు. తమ్ముణ్ణి చూసి నవ్వుతో పలకరించ బోయేంతలో తల్లి కనిపించింది. తండ్రిపోయిన తరువాత ఆమెను అదే

చూడడం. సామాన్లు విడిచి ఆమె దగ్గరకు వచ్చాడు. తల్లికి దుఃఖం ఆగలేదు. బావురుమంటూ కొడుకుని కౌగిలించుకొంది. అప్పటికినీ రఘూకి దుఃఖం ఆగ లేదు. కుర్చీమీద చతికిలబడి ముఖం కప్పుకున్నాడు.

— తెర —

# నాలుగవ రంగం

( రఘూ, శేషూ కుర్చీల్లో కూర్చున్నారు. సుగంధామయ్య సోఫాపై చదికిలపడి విసురుకొంటున్నాడు. పతి పచార్లు చేస్తున్నాడు. తల్లి ఎడమ వేపు ద్వారం దగ్గర నిలబడింది. కన్నా శేషూ కోటుతో, కళ్లద్దాలతో ఆడుతున్నాడు. రాధ మిఠాయి పళ్ళెంలో తెచ్చి మధ్యబల్లమీద ఉంచింది. నీలిరంగు చీర, పచ్చటి వెల్వెట్ బ్లౌజు వేసుకుంది. శేషు తెచ్చిన బట్టలవి. మెడలో నెక్లెసూ, నుదుటి లోతులో ఎర్రటి కుంకుమ.. ..అందం "అమాయకత"ను అలంకరించుకున్నట్టుగా వుంది రాధ.

అందరి మధ్య విదేశాలలో అనుభవాల గురించి మాటలు సాగుతున్నాయి. రాధ పళ్ళెంలో మిఠాయి తీసుకొచ్చింది- )

శేషు : (చేతుల్తో రాధ వేయబోతున్న మిఠాయిని అడ్డగిస్తూ) వద్దు వద్దు. ఇక చాల్లే రాధా! చెప్తున్నాగా! యిక చాలు, అదిగో తమ్ముడికి వెయ్యి.

రాధ : ఆయనకి మిఠాయి పడదు బావా. నువ్వేకానియ్.
(శేషు తెల్లబోయి తమ్ముడి ముఖం చూశాడు. రఘు నవ్వాడు.)

పరం : ఏదమ్మా - మరో ఉండ ఇలా తగలెయ్. దీనిసిగ తరగ తిని మూడేళ్ళు కావస్తోంది - జిహ్వా జ్ఞానం అలాంటిది-

పతి : వెధవది - ఎప్పుడూ తిండిగోడవే.

పరం : అమ్మ. ఎంతమాట ! తిండిలేక పోతే కొండంతవాడు కూడా కండ కరిగి ఎండిపోయి డీలాపడిపోతాడు. ఇహ నాతిండి అంటావా ? బాబూ, యిదేం జఠరాగ్నా ? మరోహాటా ? ఎన్ని పడేసినా మిసన్లా ఆడేస్తుంది.

శేషు ; మాటలు నేర్చావే!

పరం : (నీరసంగా) నేర్చాములేరా! నేరవక తప్పుతుందా?- ఎన్ని నేర్చినా నాపని యింతే. వీడు, పనా ముట్టక పోయె, ఇక నా మాటలే మిగులు.

లలిత : (ఆమాటలకు నొచ్చుకొని) అది సరేలే అన్నయ్యా- (మాట మార్చి) ఒరే శేషూ—అక్కడ నీ ఆరోగ్యం బాగానే ఉంటోందా?

పరం : బాగుకాక వాడికేమిటమ్మా! - సర్వకాల సర్వావస్థల్లోనూ మన శేషు ఉన్నాడే!-ఏది!- దోసకాయలాగ పిటపిటలాడుతూ నీరు కారుతూ ... (నవ్వేసి) ఏం రాధమ్మా -?

రాధ : (నవ్వి) మంచినీళ్ళు యిచ్చేదా బావా?

శేషు : ఇవ్వు.

పతి : ఏడిసినట్టుంది, నీ వెనవ Simili నువ్వూను. (లలితతో) ఏం చెల్లాయ్! మీ వాణ్ణి పండులాగ, దొరల కుర్రాడిలాగా చేసి తెస్తానన్నాను చేశానా? లేదా?

లలిత : (తృప్తిగా నవ్వింది) నీతో పంపేను కాబట్టే యింత మాత్రమయినా స్థిమితంగా ఉన్నానన్నయ్యా—

పరం : ఓయబ్బో? దీని స్థిమితం ఎవడికి తెలీదురా పతీ— వీడు వస్తున్నానని ఉత్తరం వ్రాశాడా!- అప్పట్నుంచీ నన్నూ, రాధనీ బ్రతకనిస్తేనా? "మావా డెప్పుడొస్తాడు? యీ పాటికి ఎలా ఉంటాడు? ఏవిటి తెస్తాడు?" ఇవే కబుర్లు. ఏం రాధమ్మా?

రాధ : (నవ్వి) నిజమే.

పరం : మరో మిఠాయి అల్లుడికి తీసుకురా రాధ తల్లీ!

శేషు : మరోమాటా! చస్తాను.

పతి : నాన్సెన్స్! మిఠాయి తినడానికి బాధపడతావేరా ఫూల్! అదీ మరదలు యిస్తూంటే. మిఠాయి, కన్నెత్తిన అమ్మాయి, సముద్రంమీద ప్రయాణం తృణీకరించకూడదంటాడు కేప్టెన్‌పతి. నా మొదటి పాట మరచిపోయావా?

(అంతా నవ్వారు. రాధ మిఠాయి తెచ్చింది.)

పరం : వెయ్యవమ్మా! అలా దిక్కులు చూస్తావేమిటి? బాగా తీపి తింటేకాని వొళ్ళు పెరగదురా అబ్బీ!

(రాధ వేసింది. శేషు బాధపడుతూ నముల్తున్నాడు)

పతి : ఆ రఘూగాడికి ఒకటి అందించు. అంతగా అజీర్ణం చేస్తే నామందు ఓ చుక్క తాగుతాడులే.

రఘు : నా కక్కర్లేదులే.

పరం : సరే. వాడి కక్కర్లేదుట. ఆ ఉండ నాకేయి పడేయ్ (తీసుకుని గుటుక్కున మింగాడు. ప్రక్కనే కన్నా కన్పించాడు) వోరే! వోరే! చిన్నా! యీ వెధవ, నీ కోటు కాల్చేస్తున్నాడ్రా శేషూ! నిక్షేపం లాంటి కోటు - వీడి ధణుతు ఎగరకొడితే అప్పుడు సరి పోతుంది. రాధమ్మా! వాడిచేతిలోది లాక్కో——

పతి : ఒరే అల్లుడూ! (కన్నాతో) అలాంటికోట్లు అరడజను తగలెట్టాలి - మీ అన్నయ్యవి. రూపాయిస్తాను.

పరం : నీకేం తీపి దిగదీసిందా ! – అవి పోతే వాడు మరింత పోసి కొనుక్కోవాలి.

పతి : మైగాడ్! డబ్బు సంపాయించడం చేతైన పురుషుడివి నువ్వా మాట్లాడ్డం వేం-షటప్.

పరం : అంటే !

పతి : నోరుమూసుకో అని. ఏం ? బావుందా ?

పరం : (లలితతో) చూశావమ్మా – వీడు నన్నెంత మాట అన్నాడో ?

లలిత : పోనీలే అన్నయ్యా – వాడిమాటలాట్టే పట్టించుకోకు.

పరం : అంతేలే. కుక్క– మొరిగితే మత్తేభం – ఏది ? అలాంటిదీ, యిలాంటిదీ! – కాదే పర్వతంలాంటి మత్తేభం కదుల్తుందా?– ఎబ్బే?– (లోపలనుంచి పిల్ల ఏడుపు విన్పిస్తుంది) చూడు రాధమ్మా – చంటిది గోలపెట్టేస్తోంది – ఇదో కత్తిరా శేషూ !– వాళ్ళ గుర్తూ ఏం లేదు, కాని హింత గొంతుకుంది – అచ్చు నీలాగే ఉంటుంది.

శేషు : (దిమ్మరపోయి) నాలాగా !

పరం: ఉండడం నీలాగ ఉన్నా, వీడి కడుపున పుట్టిందా, యీ పోలికలన్నీ పడి వేరు... వేరయి పోయింది. చూశావుగా ?

శేషు : చూశాను, మరో యేడాదికి ఒళ్ళు చేస్తుంది లే.

పరం : ఏం చేస్తుందో - రాధమ్మా! దాన్ని బుజ్జగించు. లేకపోతే బ్రతకనివ్వదు పిడుగు - (రాధ లోపలికి వెళ్ళింది)

లలిత : అక్కడి విశేషాలు చెప్పరా శేషూ?

శేషు : విశేషాలేముంటాయమ్మా - అన్నీ తిరిగి చూడడం. కాని ఒకటి మాత్రం నిజం. అదేమిటో యిప్పుడు విదేశాలకు వెళ్ళాలంటే చాలా సరదాగా ఉంది నాకు (రాధ ముఖంలో, ఆతృత అసంతృప్తి) ఏదో పెద్ద వ్యాపారం చెయ్యాలి. (పరంధామయ్య విస్తుపోతాడు) నా స్థలం యిక్కడ కాదు. అక్కడెక్కడో అనిపిస్తోంది. ఇక్కడ బ్రతకడంకంటె హీనం మరొకటిలేదు.

(రఘు అంతా ముందే వూహించినట్టు నవ్వుకొని, ఆశ్చర్యపోతున్న రాధ ముఖం చూశాడు)

పతి : హియర్, హియర్.

శేషు : ఈ ప్రయాణంలో చాలా విషయాలు నేర్చుకున్నాను. ఏదో మూలన కూచుని తింటూ నిద్రపోయే బ్రతుకు నాకక్కరలేదు. మనం బ్రతకాలి - నలుగుర్ని బ్రతికించాలి.

(అందరిలోనూ అతను వెళ్ళిపోవడమన్నది, అసంతృప్తి కలిగించింది. రఘు మాత్రం నిర్లిప్తంగా ఉన్నాడు.)

రాధ : (ఇక ఉండబట్టక) మళ్ళీ వెళ్ళిపోతావా బావా!

శేషు : (ఆమె ఆతృత గమనించకుండానే, మామూలుగా) అవును. వెళ్ళాలి. యిప్పుడే కాదనుకో. చేపుల్ని

వెళ్ళేపిప్పులో దేంట్లోనన్నా ఉద్యోగం చూస్తా నన్నాడు మావయ్య. వ్యాపారంలో కుదురుకునే ముందు ఓ సారి మిమ్మల్ని చూడాలనిపించి వచ్చాను.

రాధ : కాని బావా... (ఏదో చెప్పేలోపల పతి అందు కొంటాడు)

పతి : మిగతా విషయాలు నేచెప్తా వినండయ్యా—

(ఇక మాట్లాడలేక రాధ లోపలికి వెళ్ళింది)

పరం : నిన్నెవరడిగారు? అలా తగలడి బీడి తగలెట్టు— అన్నట్టు - ఏదీ ఓ దేశం చుట్ట.

లలిత : చెప్పరా శేషూ?

శేషు : ఇక్కడినుంచి తిన్నగా రంగూన్ వెళ్ళాను -

పతి : రంగూన్‌నుంచి గ్రీన్స్‌బే - లీడ్స్ -

రాధ : (పరంధామయ్యకి మంచినీళ్లు యిస్తూ) లీడ్స్ ఎక్కడుంది బావా?

పతి : అమ్మాయి అడిగిందిరోయ్. వెంటనే రిప్లయ్ యిచ్చెయ్యి - మన రెండో పారం.

పరం : (మంచినీళ్ళు త్రాగి గ్లాసు యిస్తూ) పిల్లది నిద్ర పోయిందా అమ్మా

రాధ: కాముడు అలా పొలంవేపు ఎత్తుకు వెళ్ళాడు నాన్నా. (మంచంమీద కూచుంది)

శేషు : లీడ్స్ యింగ్లండులోది రాధా!

పరం : ఓయబ్బో! అవన్నీ తిరిగి వచ్చావన్నమాట? అబ్బ!- (చుట్టని చూసి) ఛస్! దేశీ సరుకనడమే

గాని వట్టి నాసిరకం. ఏదీ, సాయిబు చుట్ట ఒక్కటి అందుకో రాధమ్మా—

పతి : ఒరేయ్ (శేషు !) క్రింపటి నెల జరిగిన విషయం చెప్పావేమిటి పిళ్ళతో ?

రఘు : లాభాలు గురించా ?—

పతి : (అసంకల్పితంగా తోసిపారేస్తూ) కాదులే. ఓ పెద్ద రిసెప్షన్. నీకేం తెలుస్తుంది.

శేషు : (తెల్లబోయి) ఏ విషయం ?

పతి : అదే మన సన్మానం.

శేషు : సన్మానమా ?

పతి : అదేలే, అప్పుడు నువ్వు లివర్‌పూల్‌లో ఉండి పోయావు. వినండి అంతా...

పరం : మొదట యిది చెప్పు. అది నీ విషయమా ? అల్లుడి విషయమా ?

పతి : నా విషయం – మై పర్సనల్

పరం : అయితే అక్కర్లేదు. కూచో.

పతి : ఏం, నేనంటే అంత అలుసా నీకు? క్రుకెడ్ రాస్కెల్.

పరం : అంటే !

పతి : తెలివితక్కువ వెధవ ? అని.

పరం : అమ్మ, అంత తిట్టా !

పతి : కాదా ఏమిటి ! నువ్వు ?

పరం : (వెర్రెత్తిపోయి) నేను వెధవనా? హారి బడుద్దాయి...

రాధ : అబ్బ !... బావని మాట్లాడనివ్వరేమిటి మీరు ?

పతి : అదికాదు రాధా!— 'యూ ఆర్ ఎ ఫైన్ గర్ల్' ఓ చిన్న యిన్సిడెంట్ చెప్తాను (పరంధామయ్య మాట్లాడబోతే) ఓ సారి నువ్వు నోర్మూయ్.

పరం : మూశాలే. ఏడువ్. ఒరే కన్నా నువ్వు గట్టుదిగు ...

పతి : ఓ సారి మా 'షిప్పు'లో వాళ్ళంతా నాకు సన్మానం చెయ్యాలనుకున్నారు.

రాధ : ఎందుకు?

పతి : అబ్బో! నేను చాలా పెద్దవాణ్ణిలే, మీకు తెలీదు — అందుకు. నిజానికి మనం ఎక్కడుంటే అక్కడ సభలూ, సన్మానాలూనూ. ఓ సారి ఢిల్లీ పోర్టులో షిప్పు ఆపానో, లేదో బ్రహ్మరథం పట్టేశారు నాకు —

రఘు : అదేమిటి మావయ్యా! — ఢిల్లీలో హార్బరెక్కడిది?

పతి : (చటుక్కున నాలిక కరుచుకుని) అరెరె! — ఢిల్లీలో పోర్టులేదు కదూ— మరిచేపోయేను.

పరం : పోరా! వెధవకోతలూ నువ్వూనూ, ఎవరికి తెలీదు.

పతి : నోర్మూయ్యరా — అసలు కోతలు కోసి కోసి అంతవాడయ్యాడు రాబర్ట్క్లైవ్. నిజం చెప్పాలంటే కోతలు గురించి 'కోస్మాండు బేకా' అనే ఆయన...

పరం : సరేలెద్దూ — వెధవ కబుర్లూ... శేషుని ఆ విషయం చెప్పనీ.

పతి : (నిరుత్సాహపడి) నాలాంటి వాడితో మాట్లాడడానికి నీ కెంత 'ఎడ్యుకేషన్' కావాలి!— నువ్వో

చెప్పరా శేషూ! డామెస్టిక్ ఫోక్ తో... (అంతలో) జస్టె మినిట్ - అమ్మా లలితా! - నీకో విషయం చెప్పాలనుకున్నాను ఇప్పుడిప్పుడు శేషుని చూస్తుంటే నీకేమనిపిస్తోంది?

(అందరూ ఆశగావైపు వింతగా చూశారు.)

లలిత : ఏమనిపిస్తోంది?

పతి : ఏమీ అనిపించటంలా? వాడెంత పెరిగాడో చూశావా? పుట్టడం 'రెచెడ్' ఇండియాలో... చదువు లీడ్స్ ఫార్వర్డ్ కాలేజ్ - ఉద్యోగం జకార్తా. పదిక్లాసులు చదివాడు, పదిప్రూళ్ళు తిరిగాడు, పదిరూకలు జాగ్రత్త చేశాడు నేడో రేపో ఓ పెద్ద ఫర్మ్ మేనేజింగ్ డైరెక్టరయి కూచుంటాడు... ఇప్పుడేమంటావ్?

లలిత : అంతా నీచేతి చలువ.

రాధ : నువ్వు దారి చూపించావు బావకి.

పరం : ఆ... వీడి గొప్పేముందిలే బోడి గొప్ప. ఒక్కమాట చెప్తాను వినమ్మా... అదృష్టవంతుణ్ణి యిలాంటి చేట పెయ్యలు వందమందయినా కదల్చలేరమ్మా... ... (కాస్త ఆగి) మరి మన రఘూ వున్నాడు... ఎందుకూ?- (అందరూ యీ మాటకు బాధపడ్డారు. రఘు నివ్వెర పోయేడు. అది గ్రహించి) అహా! నేను అన్నానని కాదు, ఆలోచించండి.

రఘు : (అంతలో తేరుకుని, నవ్వి) నిజమే మావయ్యా! అన్నయ్య అదృష్టవంతుడు; నేనలా కాదు.

రాధ : నీది మరీ నోటి దురుసు నాన్నా. (గ్లాసు తీసుకుని వంటింట్లోకి వెళ్లింది.)

పరం : మాట అన్నానని కాదు. ఏరా రఘూ ? మన శేషు అదృష్టజాతకుడవునంటావా ? కాదంటావా ? — (పతితో) అవునురా, వర్షాలు బాగులేక, మనుషులు ఎదురు తిరిగితే రివటలాంటి వీడేం చేస్తాడ్రా ?— మహామహా వాళ్ళకే ఓ అంతుకాని లొంగదు యీ భూమి. అటు మనుషులెవరూ సాయం చెయ్యకా పోయె, యిటు వీడికా ఏమీ చేతకాకపోయె-ఇక నా మాటలే మిగులు.

శేషు : ( కోపంతో మొహం ఎర్రపడింది. ) మనుషులు ఎందుకు మారేశారో నే చూస్తాలే వెధవలకి పాగ రెక్కి గుమ్మం దాటారు వీళ్ళు. మక్కెలిరగదన్నితే పోయేది.

పరం : సరి, మొదటిదానికి మొగుడే లేడు. కడపటి దానికి కళ్యాణమన్నాట్ట - ఆ చాకచక్యమే ఉంటే యిలా ఉండడమేం ? అహ! నేనన్నానని కాదు. అయిత్తే ఒహటి ! వీడేం చేస్తాడులే. పాపం ! నీరస ప్రాణం!

రఘు : (నవ్వేడు)

పతి : అమ్మా! లలితా ! వాడ్ని అప్పుడే నాతో పంపి వుంటే ఎంత బావుండేది ?- ఏమంటావ్ ?

లలిత : ఏం చెప్పనన్నయ్యా - అంతా యిలా జరగాల్సి వుంది.

పతి : వీడు మాత్రం ?-(రఘుని చూపుతూ) వీడూ అంతేలే. 'రారా నాతో' అంటే 'ప్రేమ-పెళ్ళి' అని కూచున్నాడు. ఏం? రాధ యివాళ యిక్కడ లేదూ? ఎక్కడికి పోయింది ? - ఇప్పుడు పెళ్ళి చేసుకుంటే ఏం పోయేది ? నాతో వస్తే యీపాటికి 'బెర్నార్డ్ షా' అంతటివాడిన్ని చేసి ఉంచనూ ? ఇటు శేషు పోలాన్ని చూస్తే ఎంత బాధ్యుండేది.? - ఏరా పరం ?

పరం : తెలివి తక్కువ వెధవైనా యిన్నాళ్లకి ఓ మంచి మాట చెప్పాడమ్మా.

పతి : అదీ మాట.

శేషు : ఇంతకూ కారణం నాన్న పోవడం. ఆయనే వుంటే ఏ తాపత్రయం ఉండేది కాదు.

పరం : సరేలే, అది కొంతవరకు నిజమే కాని, వీడి చేతకాని తనానికి ముసలాడేం చేస్తాడా ? అయితే ఒహటి - అయినవాడూ, యింటికి పెద్దదిక్కూ పోయాడని విచారించాలి, కామా మరి ?

పతి : అంతెందుకు ? నిండుగా ఆ కుర్చీలో కూర్చుంటే నేనే మాట్లాడ్డానికి భయపడేవాణ్ని.

పరం : ఈ కన్నాగాణ్ని చూశావా ? నీ కోటుతో ఆడి ఆడి యిక్కడి పడేసి పారిపోయేడు. (రాధ కోటు తీసి కన్నా కోసం వీధిలోకి వెళ్లింది.)

శేషు : ఒక్కటి చెప్తానమ్మా - "పొలం బాగు లేదు, - పొలం బాగులేదు" అని మాటిమాటికీ అంటూ వాణ్ని

నొప్పించడంవల్ల ఏమీ లాభం లేదన్నా — వాడు మాత్రం ఏం చేస్తాడు? పనిచేసి, చేసి వాడు ఎండి పోయేడు. అవును మావయ్యా, నీకు చేతకాని పని చెయ్యమంటే నువ్వెలా చేస్తావ్?—ఏదో పనికోసం పుట్టలేదు.

(రాధ యిప్పుడు లోపలికి వచ్చింది)

పరం : ఆఁ...సరేలే, నువ్వుమాత్రం యీ పొలం పనికోసం పుట్టావేమిటి? అయినా నువ్వన్నదీ నిజమేలే...... వాడో రోగిష్టివాడు, మనిషీ అల్పం. ఇంకా నేనయినా...(దగ్గు)కాస్త నయం...(దగ్గుతో ఆయాసం వచ్చింది.) పయిగా ఆ చేతకానితనం ఒకటి తినేస్తోంది. అహా!—నే నన్నాననికాదు. ఉన్నమాటంటే ఎప్పుడూ వెగటుగానే ఉంటుంది. ఏం రాధమ్మా?

రాధ : (మామూలుగా) అవును బావా! ఆయన మటుకేం చేస్తారు?—ఏ రోజూ పుస్తకం చదవందే ఉండలేరు. వేళకి భోజనం లేకపోతే ఉండలేరు. ఆకాశంవేపు చూస్తూ నిలబడలేకపోతే ఉండలేరు....యిక వీటి తర్వాతే పొలం పని (మాటలకి రఘూ దిగ్భ్రమతో ఆమె ముఖం చూడబోతే) తువాలు తెస్తానుండు.

(అని చటుక్కున వెళ్ళిపోయింది.)

శేషు : (విచిత్రంగా రఘుని చూశాడు)

రఘు : (సర్దుకుని) నిజమేనన్నయ్యా — నేనేం కాదనను. నాకీ పొలం పని రాలేదు, రాదు. నాచేతకానితనం కాకపోతే యీ పాటికి పొలం బంగారంలాగ వుండేది.

రాధ : (తువాలుతో వచ్చి—భర్తవైపు చూడకుండానే) సరే, యిలా కబుర్లు చెబుతూ కూచోకపోతే ఓ సారి ఆ లక్ష్మయ్యగారింటికి వెళ్ళి తనఖా ఏమయిందో చూసి రాకూడదూ?

శేషు : (విసుక్కుపోతూ) తనఖా ఏమిటి? పొలమా?

పరం : (వికటంగా నవ్వి) లేకపోతే వీడి దగ్గరేముందని పెట్టాడు తనఖా?—పెళ్ళానికి నగలున్నాయనా?— మొన్న పుట్టిన పిల్లకి గొలుసులు తొడిగాడనా?

శేషు : ఛీ! మన పొలం తనఖా ఏమిటీ? కావలసినంత డబ్బుతో వచ్చాను. ఎంత కావలిస్తే అంత తీసుకో.

పతి : తీసుకోరా - వన్ - టూ - త్రీ—నీ యిష్టం. ఇప్పుడే చెక్కురాసి తెప్పిస్తాను.

రఘు : (నవ్వేడు) యిప్పుడేం వద్దులే!

పరం : ఎవడ్రా వీడు? డబ్బిస్తూంటే వద్దంటాడేం ఖర్మ — చూడమ్మా లలితమ్మా - కావల్సినవాడూ, అయిన వాడూ, స్వయానా అన్నయ్యా యిస్తే తీసుకోవడం తప్పా?

లలిత : వాడికి నే చెప్పాలా అన్నయ్యా?

పతి : తీసుకోరా. దానికింత స్ట్రగుల్ (struggle) ఎందుకూ? "వెనుకంజ వేయించారు నన్ను చేరలేము" అన్నారు బైబిల్లో. ఏదీ చెక్ బుక్? (జేబు వెదుక్కుంటూంటాడు)

రఘు : (స్థిమితంగా) కావలిస్తే అడుగుతాను మావయ్యా.

రాధ : ఏం పోయినా ఆయన అభిమానం మాత్రం పోగొట్టుకోలేదు.

పరం : బాగా అన్నావు. దానిచేతికి ఓ పాతిక వేలు యిచ్చిపోరా. తర్వాత వాడే తీసుకుంటాడులే. ఏం? డబ్బంటే చేదా యేమిటి?

పతి : ఆల్ రైట్. (చెక్ బుక్ కాలుమీద ఆనించి వ్రాయబోతాడు.)

రఘు : (ఉన్నట్టుండి అరిచాడు) మావయ్యా!

పరం : అలా గావుకేకలు పెడతావేం రా? మేమంతా యిక్కడ లేమూ?

రఘు : ఉన్నారు. ఉండి నే నిక్కడ చచ్చాననుకొని మాటలు సాగిస్తున్నారు. (ఆవేశం తగ్గించుకు, పతితో) మావయ్యా! నీ సహాయానికి కృతజ్ఞుణ్ణి నీ డబ్బు నాకవుసరం లేదు. కావలసినప్పుడు నేనే స్వయంగా వచ్చి అడుగుతానులే.

పరం : నే చెప్పే... ...

రఘు : నువ్వేం చెప్పకు నాతో.

పరం : చెప్పొద్దూ?

రఘు : చెప్పొద్దు. అలా అయితేనే ఇక్కడ కూచో. లేకపోతే బయటికి నడువ్. ఇలాంటి వెధవ సలహాలు నాకక్కర లేదు.

రాధ : ఆయనకి నువ్వేం చెప్పక్కర్లేదునాన్నా (వ్యంగ్యంగా) ఆయనకంతా తెలుసు.

రఘు : (రాధవైపు తిరిగి)- నువ్వూ అంతే.. తెలివిగా మాట్లాడాననుకోకు. ఇప్పట్లో నోరు మూసుకోవడం ఎంతయినా మంచిది.

లలిత : (వినిపించీ వినిపించనట్టు) ఊరుకో రఘూ—

రఘు : (తల్లిమాట వినడంతో దుఃఖం ఆగలేదు. గొంతు పూడుకు పోయింది) నీకు తెలీదమ్మా - వచ్చిన పాముని చంపుతున్నారు వీళ్లు - (స్థిమితపడి అన్నయ్య వైపు తిరిగి ఏదో చెప్పబోయి చెప్పలేక గుంజాటన పడి వెనక్కి తిరక్కుండా వెళ్ళిపోయేడు)

పరం : (వెళ్ళేవరకూ ఆగి-గట్టిగా ఎత్తుకున్నాడు) ఓయబ్బో! చేతకానితనానికి తోడు... (మాటలో రఘూ లోపలికి వచ్చాడు చెప్పుల కోసం. చటుక్కున ఆగాడు పరం. రఘు వెళ్ళగానే వాక్యం పూర్తిచేశాడు)... కోపమొకటి రాజుగారికి (మరిహ పరం మాట్లాడలేదు.)

లలిత : మరీ వాణ్ణిలా హింసించడం న్యాయం కాదు మీకు. వాడి బ్రతుకు వాణ్ణి బ్రతకనివ్వండి. (దుఃఖం పొర్లు కొచ్చింది - వెళ్ళిపోయింది.)

పతి : (శేషూతో) వీడి మెదడు కాస్త పాక్ తిన్నట్టుంది— ఏమంటావ్ ?-

పరం : మెల్లిగా అంటావేమిటి ? వీడికసలు మెదడే లేదని నా అనుమానం. యింకో డయితే అంత డబ్బు...

పతి : ఉండరా నీకెప్పుడూ డబ్బుగొడవే — పిసినారి వెధవా ?

శేషు : అవును మావయ్యా – వాణ్ని మీరంతా అలా నొప్పించకూడదు. ముఖ్యంగా, రాధా...

రాధ : (ముఖం చూస్తుంది.)

శేషు : నిన్న నమ్ముకు బ్రతుకుతున్నాడు వాడు. నీకూ ఆ విషయం తెలుసు. అది గుర్తుంచుకో.

(రాధ లోపలికి వెళ్లింది. క్షణం నిశ్శబ్దం. కన్నా వచ్చి బయట ఎవరో వచ్చారని సంజ్ఞ చేశాడు.)

శేషు : (అర్థంకాక) ఎవర్రా ?...

(కన్నా 'బంట్రోతు' అన్నట్టుగా సెల్యూట్ చేసి నిలబడ్డాడు, శేషూ అతనితో పాటే బయటికి వెళ్ళాడు.)

పరం : (మెల్లిగా) అయితే పతీ ?–మాట... ...

పతి : (విసుగ్గా) చెప్పు.

పరం : మన శేషుకి జీతం ఎంత యిస్తార్రా ?

పతి : (నవ్వి) హారినీ... వాడికి జీతమేమిటా వాడే మిగతా వాళ్ళకి జీతం యిస్తాడు... సూపరింటెండెంట్! సూపరింటెండెంట్! ఆఫ్ 'జలజ్యోతా'! పతీ నేవిగేషన్ లిమిటెడ్. (ఇండిస్తూ) – అదీ, తెలిసిందా ?

పరం : మెల్లిగా అడిగితే అలా అరుస్తావేరా కీచురాయిలాగ. వెళ్ళి మంచినీళ్ళు తాగు.

శేషు : (లోపలికి వస్తూనే బయటికి చూసి) అలాగే, అలాగే, నువ్వెళ్లు. నీ వెనకే వస్తాడు

పతి : Halt ! who comes there ఎవర్రా అది ?

శేషు : షిప్‌పోర్టరు మావయ్యా, ముఖర్జీగారు లెటరు పంపించారు.

పతి : ఏ ముఖర్జీ ?

శేషు : కలకత్తా ముఖర్జీ – స్టీవెడోర్స్.

పతి : ఓహ్హో ! ఆ ముఖర్జీయా? ఏదీ (ఉత్తరం తీసుకు చదువుతాడు )

పరం : (మెల్లగా) ఎవర్రా యీ ముఖర్జీ ? – మన ఆయుర్వేదం వైద్యుడేనా ?

శేషు : (నవ్వి) కాదు మావయ్యా. కలకత్తాలో పెద్దకంపెనీ ఉందిలే యీ ముఖర్జీగారిది. నాలుగు షిప్పులు కూడా వున్నాయి యీయన చేతికింద.

పరం : అబ్బా ! పెద్దవాడేనన్నమాట. ఏమిటి వ్రాశాడో ?

పతి : నీ మొహం వ్రాశాడు. ఒరే శేషూ, మన ఫ్రెండ్ ముఖర్జీ యీ పోర్టులోనే ఉన్నాట్ట.

శేషు : యిక్కడే !

పతి : ఆఁ యస్. యస్. టెరియా, (S. S. 'Teria) లో వచ్చి ఫ్రంటాడు. ఓసారి కలవమన్నాడు. ఇదేదో పెద్ద తంతులా ఉందిలే – నే నొచ్చేవరకూ యిక్కడే ఉండు. టోపీ తీసుకుని వెళ్తాడు)

పరం : (కాసేపయాక) అమ్మాయి రాధా! బావకి కాస్త మంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా—ఒరే శేషూ? నువ్వుంటే యిల్లంతటకీ మళ్ళీ చైతన్యం వచ్చినట్టుందిరా—

శేషు : దానికేంలే - మనం అనుకోవడంలో ఉంటుంది—

పరం : అనుకోవడం కాదు. నిజం. నీమీద ఒట్టు. ఏమమ్మా?

రాధ : (నీళ్ళు తెచ్చి) ఏమిటి నాన్నా?

పరం : శేషు వుంటే యిల్లంతటికీ కళ వచ్చింది కదూ?— ఏ మంటావ్?

రాధ : ఇలాంటి కబుర్లు చెప్పాలంటే నాన్న తర్వాతే ఎవరైనాను. (నవ్వుతుంది) కాఫీ తాగుతావేమిటి బావా?

శేషు : ఇప్పుడేం వద్దులే.

(రంగయ్య అరటిపండు గెలతో వచ్చాడు. రాధ లోపలికి వెళ్ళింది.)

రంగ : దండాలు పెదబాబుగారూ!

శేషు: ఏం రంగయ్యా? యిలా వచ్చావ్. (కాస్త ఆగి) చిన్నబాబుని వీరంతా వెలివేశారటగా?

రంగ : అదేమిటయ్యా?

శేషు : అదేలే. అందరూ వాణ్ణి వదిలిపోయేరటగా?— అంతలో మనుష్యులు చచ్చిపోరులే. అసలు వీళ్ళందరికీ ఓ పాఠం చెప్పాలనుకుంటున్నాను.

రంగ : ఎదవలందరికీ బుద్ధిలేదు బాబూ!

శేషు : నువ్వేమంతం? - పంటకాలంలో, నీరు వాలుపట్టే సమయానికి జారుకున్నావట! — వీడు చస్తాడనా, బతుకుతాడనా నీ ఉద్దేశం?

రంగ : ఏం చెప్పను బాబూ !- మిగతా ఎదవలంతా కట్టుగట్టి తెల్లారేసరికి మ్మా నెయ్యాకపోతే దారి కాత్తామన్నారు. నేను బెదిరిపోయాను. పిరికివాణ్ణి. అసలు మీకు భయ పడే ఆరంతపనిసేశారు బాబూ. పయిగా మీరంటే ఆరికి అభిమానం బాబూ.

శేషు : ఏం, వీడేనేమిటి అంతపాపం చేసుకున్నది ? అసలు మీ అందరికీ కళ్ళు నెత్తిమీదికి పోయాయిలేరా. చూస్తాను, చూస్తాను. ఈ ఆటలు ఎన్నాళ్లు ఆడతారో? నాకేం లక్ష్యం లేదులే. ఇవాళ్టికివాళ ట్రాక్టర్లు పట్నం నుంచి తెప్పించగలను, చూస్తారా ?

రంగ : నన్నాళ్ళతో కలపకండి బాబూ! నేను చివరంటూ చిన బాబుని కాస్తూనే ఉన్నాను. అయినా యీయన మరీనండి. కాలుమడుచుకూర్చుంటే ఎలా చెప్పండి? సత్తాలేక పోయినా మాటయినా అనరే ?

పరం : ఈ పళ్ళు యింట్లో పెట్టు రాధమ్మా ! మగ్గిపోతాయి. కూచోవోయ్ రంగయ్యా - (ఓ నాలుగు పళ్ళు తీసి పక్కన ఉంచుకున్నాడు.)

రంగ : చిత్తం.

శేషు : అయితే రంగయ్యా ! నువ్వోకమాట చెప్పు. ఇది చెప్పడానికే నిన్ను పిలిపించాను. ఎవరు నాదగ్గ ర్నుంచి పోయినా నాకు లక్ష్యం లేదు. రేపు పొలం లోకి వస్తాను గడ పట్టుకుని. మిగతా జట్టంతటితో చెప్పు, జాగ్రత్తపడమని. నా కెదురు నిలబడితే నిల

బడండి. అంతా సత్తా చూసుకున్నాం; కాని వాడికేం తెలీదు. తమ్ముడితో మీకు పోటీలా; వాడు పొలం లోకి తప్పక వచ్చాడ్రా.

రంగ : నేను రేపొస్తాను బాబూ పొలంలోకి—

శేషు: ఇంకా ఆ లక్ష్మయ్యగారి పొలంలోనే ఉండాలంటే ఉండు. నాకేం బాధలేదు. లక్ష్మయ్యగారి టోపీ మీ అందరికీ తలకెక్కిందిలే. ఎప్పుడో ఒకప్పుడు చూసి చూసి కోతంతా అయ్యాక మిమ్మల్ని నిలువునా తడి పేస్తాడు. అక్కడితో ఒక్కొక్కడికే కుదురుతుంది రోగం. జ్ఞాపకం లేదూ – దసరా ఉత్సవాలకి చెరువు గట్టున యుద్ధం?

రంగ : చిత్తం.

పరం : వీళ్ళకి జ్ఞాపకాలేమిట్రా? మంచీ చెడూ ఉంటేగా? అయినా చూసి చూసి రఘూ నీదన ఎవరు ఉంటూరా? నంగిరి పనులూ, ఏడూనూ.

శేషు : అదికాదు మావయ్యా! నువ్వెంతసేపూ తమ్ముడినే అంటావుగాని, యీ దరిద్రుల తలబిరుసు చూడవేం?

పరం : చూస్తున్నాను, చూస్తున్నాను ఈ కాలూ చెయ్యీ లేకపోయింది గాని... లేకపోతే నేనే ఓ వరస పట్టేద్దును. పింజారీ వెధవలు.

రంగ : (విసుగ్గా) ఉండండి, మీకేమీ తెలీను.

పరం : ఏమిట్రా తెలీదు? యీ చేతకాని వెధవను చూసేనా నువ్వానాడు తెగ వాగి పారిపోయావ్? (శేషుతో)

వెళ్తూ వెళ్తూ వీడన్నిమాటలన పోయాడనుకున్నావ్? నడుగు.

శేషు : అంటాడులే! రంగయ్య... పాతరంగయ్య కాడు.

రంగ : అన్నీ తెలిసిన మీరే అలా అంటే ఎలా బాబూ?

శేషు : సరే వెళ్ళు. నేనలా రేపు పొలంలోకి వస్తాను. రేపు ఆ కట్ట బిగేసి కింది పొలానికి కాలవలు కట్టాలి. మావయ్య పొలానికి కూడా గళ్ళువేస్తాను రేపు. శ్రావణానికి విత్తులు పడాలి.

రంగ : చిత్తం.

శేషు : ఇక నువ్వెళ్ళు తమ్ముడిమీద తిరగబడ్డ ఏ వెధవనీ వదలనని అందరితో చెప్పు. అవునురా! డబ్బుకావలిస్తే ఒకటీ, రెండూ హెచ్చు తీసుకోండి. ఒళ్ళు తీటగా ఉంటే నాలాంటివాడితో కలియబడండి. అంతేకాని, రఘూ వంటిమీద యీగ వాలకూడదు. తెలిసిందా, అసలే వాడు అల్పం—

రంగ : చిత్తం.

శేషు : నువ్వెళ్ళిరా, నీ అరమరికలు నాకు తెల్సులే. నినోృ కంటను చూస్తాను. ట్రాక్టర్ డ్రైవరీ చేస్తావా? పట్నానికి రికమెండ్ చేస్తాను.

రంగ : అలాగేనండి.

శేషు : సరేలే నే చెప్తాను.

రంగ : వత్తా బాబూ— (దండంపెట్టి వెళ్తాడు).

పరం : ఒరే శేషూ! హొలం పనికి టన్నా నీలాంటివాడుండాలి. అన్ని సంగతులూ అలా నిముషంలో తేల్చేశావా? నా మట్టుకు నాకే మతిపోయింది. (రాధ వచ్చింది) చూశావా రాధమ్మా! అదీ చాకచక్యం అంటే.

రాధ : (నవ్వింది) మిఠాయి మరి కొంచెం తింటావా బావా? తెచ్చేదా?

శేషు : మీ అయ్యని వెనకేసుకొచ్చినందుకు లంచం ఏమిటీ? (రాధ నవ్వి లోపలికి వెళ్లింది)

పరం : (లోపాయుకారీగా) అలా ఎందుకనుకోవాలీ?– నీకు కట్నం ఎందుకు కాకూడదూ? (మాటలో వ్యంగ్యానికి శేషు విస్తుపోతే పరంధామయ్య నవ్వేసి భుజం తట్టాడు.) అలా వెళ్లి చెట్టుకింద చతికిలపడతాను. (లేచి వెళ్ళాడు)

(రాధ పళ్ళెంతో మిఠాయి తీసుకొచ్చి బల్లమీద ఉంచింది. శేషు పరాకుగా పరంధామయ్య వెళ్ళిన వైపు చూస్తూ, ఏదో ఆలోచిస్తున్నాడు. అతని ముఖాన్ని క్షణం గమనించి నవ్వుకొంది. కిటికీ దగ్గరికి వచ్చి బల్లని ఆనుకుని నిలబడింది. బల్లమీంచి పుస్తకం జారి క్రింద పడింది. శేషు తుళ్ళిపడి యిటు తిరిగి రాధని చూసి సర్దుకుని మిఠాయి తినడం ప్రారంభించేలోగా రాధ మాట్లాడింది.)

రాధ : బావా!

శేషు : ఏం?

రాధ : ఒక్క మాట అడిగేదా?

శేషు : ఊఁ.

రాధ : నా ముఖం చూసి చెప్పాలి.

శేషు : (విస్తుపోయాడు) ఏమిటి ?

రాధ : ఇదివరకు ఏ కారణంవల్ల వెళ్లిపోయావో, యిప్పుడూ అదే కారణంవల్ల వెళ్తున్నావా నువ్వు ?

శేషు : ఎక్కడికి రాధా !

రాధ : అదే ! ఎక్కడికో వెళ్లిపోవాలనుందన్నావుగా ? — వ్యాపారం చేస్తానని - నావల్లే వెళ్తున్నావా ?

శేషు : అదేమిటి రాధా ?

రాధ : అవును బావా !—మన మనస్సులు బావుంటే ఎవర్ని చూసినా మనం భయపడనక్కర్లేదు. నా అన్నయ్య దగ్గర నేను సిగ్గుపడనక్కరలేదు. మూడేళ్ళ క్రిందటే శేషుగా నిన్ను మర్చిపోయాను.

శేషు : (తడబడి, awkward smile come తో రాధా ! అప్పటి విషయాలింకా జ్ఞాపకం వున్నాయా నీకు ? నిజంగా అప్పుడు నే నెంత తెలివితక్కువవాణ్ణయానా అనుకొంటూంటాను జ్ఞాపకం వచ్చినప్పుడల్లా. అప్పట్లో నేను చాలా పొరపాటుపడ్డాను రాధా !

రాధ : (బాధపడి) పోనీలే, అప్పటి విషయాలు.

శేషు : ఒక్కసారి తెలివితక్కువగా బ్రతికినంతమాత్రాన ఎప్పుడూ అలానే బ్రతుకుతాననుకోకు. ఆ గందర గోళమంతా ఆనాడే మరచిపోయాను. ఇప్పుడు నువ్వు నాకు చెల్లెలు తప్ప యింకేమీ కావు... ...

(కాస్సేపాగి) ఒక్కటి మాత్రం నిజంగా అడగాలని ఉంది.

రాధ : చెప్పు.

శేషు : తమ్ముడిమనస్సు నొప్పించకు. అమ్మపోలిక వాడిది. పైకి మాట్లాడలేడు. లోపల్లోపల కుమిలిపోతాడు.

రాధ : (ఉదాసీనత కలిగింది) నేనేం నొప్పించాను? తనే చేతకానివాణ్ణని, దురదృష్టవంతుణ్ణనీ, ఏమీ తెలీదనీ.

(చెప్పబోయేలోగానే రఘూ వస్తాడు. రాధ ఆగిపోయింది నోటుకొచ్చిన. రఘూ వీళ్ళిద్దరినీ క్షణకాలం చూస్తూ ఆగిపోతాడు. రాధ వెళ్ళిపోయింది.)

శేషు : ఏమయిందిరా వెళ్ళిన పని?

రఘు : తనఖాకి కాగితం రాసుకొచ్చాను.

రాధ : ఎంతకి? (గుమ్మం దగ్గిర ఆగింది)

రఘు : ఎనిమిది వందలు.

శేషు : పదెకరాలూనా? – ఈ లక్ష్మయ్యది గుండా, రాయా? దరిద్రుడు... మొన్న మొన్నటి వరకూ వాడి కొడుకు మనపొలంలో జేరాడు. ఇవాళ కదూ ఆ వెధవ మేడకట్టింది?

రఘు : (నవ్వేడు.) కాని యివాళరోజు వాడిది. కోపం తెచ్చుకుంటే ఎవడికి నష్టం?

శేషు: ఛీ! మన పరువూ ప్రతిష్ఠాగురించి ఆలోచించవేంనువ్వు. మనకేం డబ్బులేదుగనకనా? – నాకంటే ఆ కసాయి వెధవ హెచ్చా నీకు? ఒకటీ, రెండూ, మూడూ...

నీ యిష్టం పాతికవేలు యిస్తానన్నా నీకు చాలా?
నాగమణెయ్య పోతానన్నా - అన్నదగ్గర డబ్బు తీసు
కోవడం తప్పా?

రఘు : (మాట్లాడడు. రాధ వచ్చింది. ఏమైనా జవాబు చెప్తా
డని ఎదురు చూస్తోంది ఇది గమనించి) మంచినీళ్లు
తీసుకురా (రాధ లోపలికి వెళ్ళింది)

రఘు : (మెల్లగా ప్రారంభించాడు) నీకు తెలీదన్నయ్యా.
ఇప్పటికే యీ యింట్లో ఏమీ చేతకానివాణ్ణయాను.
నీ డబ్బు నా చేతకానితనానికి మరో బొట్టవుతుంది.
సరేలే ఆ విషయాలు - ఈ మూడేళ్ళలో నువ్వేం
చేశావో చెప్పు—

శేషు : ఏంచేస్తేనేంలే - ఎంత సంపాదించినా సమయానికి
అక్కరకురానిది. ఎందుకు వెధవ డబ్బు!

రఘు : (నవ్వుతాడు, అన్నయ్య కోపం చూసి)

శేషు : (ప్రాధేయపూర్వకంగా) నామాట వినరా - పోనీ,
మనుషుల్ని ఏర్పాటుచేస్తాను. సరా?

రఘు : అదీ వద్దులే.

శేషు : పొలం సాగుకి ట్రాక్టర్లు తెప్పించనా?

రఘు : ఎందుకన్నయ్యా - పదెకరాల పొలానికి ట్రాక్టర్లు?

శేషు : నల్లావు పోయిందటగా?

రఘు : మొన్ననే పోయింది.

శేషు : ఎర్రజత ఏడాదికిందటే పోయిందన్నాడు మావయ్య?

రఘు : అవును. జబ్బపడి కాళ్ళుచాచాయి.

శేషు : ఇలాంటి పరిస్థితుల్లో, యీ అమాయకత్వంతో, యీ మంచితనంతో, నువ్వెలా బతుకుతావో నాకేం అర్థంకావడంలేదురా ! 'దేహీ' అంటే ఎవరూ తిండి పెట్టరు. నాలుగుతన్ని నీ భాగం నువ్వు లాక్కోవాలి తెల్సిందా !

రఘు : సరేలే ! ఈ గొడవకేంగాని – ఇన్నాళ్ళు నువ్వేం గొప్పతనం ఆర్జించావో చెప్పు.

శేషు : గొప్పతనానికేముందిలే ! – ఊళ్ళుతిరిగొచ్చానన్న గొప్పతనం ఒకటి మిగిలింది.

రఘు : అలా కాదన్నయ్యా ! నీ గొప్పతనానికి పోల్చి నన్ను గౌరవిస్తున్నారిక్కడ. నా సత్తాకి నీ గొప్పతనం తూనికరాళ్ళయాయి. ఏం రాధా !

రాధ : (మంచినీళ్ళతో వచ్చింది) పుస్తకా లెన్ని చదివినావో అడుగు బావా !

రఘు : మరిచిపోయాను, పుస్తకాలన్నిటినీ ఓ రోజు కాల్చి వేద్దామనుకుంటున్నా నన్నయ్యా. ఏదైనా వంటకి ఎసరైతే బావుణ్ణని.

శేషు ; అదేమిట్రా ?

రఘు : ఏమిటో రాధనే అడుగు. నా పుస్తకాలు నాచేతకాని తనానికి నిదర్శనం – యిదీ యిక్కడ నా బతుకు–

రాధ : అలా అనుకోకపోతే చస్తానన్నాడమూ ! (లోపలకు వెళ్ళింది.)

నీ యిష్టం పాతికవేలు యిస్తానన్నా నీకు. చాలా? సాగుచెయ్యి పొలాన్ని - అన్నదగ్గర డబ్బు తీసుకోవడం తప్పా?

రఘు : (మాట్లాడడు; రాధ వచ్చింది. ఏమైనా జవాబు చెప్తాడని ఎదురు చూస్తోంది ఇది గమనించి) మంచినీళ్లు తీసుకురా (రాధ లోపలికి వెళ్ళింది)

రఘు : (మెల్లగా ప్రారంభించాడు) నీకు తెలీదన్నయ్యా. ఇప్పటికే యీ యింట్లో ఏమీ చేతకానివాణ్ణయాను. నీ డబ్బు నా చేతకానితనానికి మరో మెట్టవుతుంది. సరేలే ఆ విషయాలు - ఈ మూడేళ్ళలో నువ్వేం చేశావో చెప్పు—

శేషు : ఏంచేస్తేనేంలే - ఎంత సంపాదించినా సమయానికి అక్కరకురానిది. ఎందుకు వెధవ డబ్బు!

రఘు : (నవ్వుతాడు, అన్నయ్య కోపం చూసి)

శేషు : (ప్రాధేయపూర్వకంగా) నామాట వినరా - పోనీ, మనుషుల్ని ఏర్పాటుచేస్తాను. సరా?

రఘు : అదీ వద్దులే.

శేషు : పొలం సాగుకి ట్రాక్టర్లు తెప్పించనా?

రఘు : ఎందుకన్నయ్యా - పదెకరాల పొలానికి ట్రాక్టర్లు?

శేషు : నల్లావు పోయిందటగా?

రఘు : మొన్ననే పోయింది.

శేషు : ఎడ్లజత ఏడాదికిందటే పోయిందన్నాడు మావయ్య?

రఘు : అవును. జబ్బుపడి కాళ్ళుచాచాయి.

శేషు : ఇలాంటి పరిస్థితుల్లో, యీ అమాయకత్వంతో, యీ మంచితనంతో, నువ్వెలా బ్రతుకుతావో నాకేం అర్థంకావడంలేదురా 'దేహీ' అంటే ఎవడూ తిండి పెట్టడు. నాలుగుతన్ని నీ భాగం నువ్వు లాక్కోవాలి తెల్సిందా ?

రఘు : సరేలే ! ఈ గొడవకేంగాని - ఇన్నాళ్ళు నువ్వేం గొప్పతనం ఆర్జించావో చెప్పు.

శేషు : గొప్పతనానికేముందిలే ! - ఊళ్ళుతిరిగొచ్చానన్న గొప్పతనం ఒకటి మిగిలింది.

రఘు : అలా కాదన్నయ్యా ! నీ గొప్పతనానికి పోల్చి నన్ను గౌరవిస్తున్నారిక్కడ. నా సత్తాకి నీ గొప్పతనం తూనికరాళ్ళయాయి. ఏం రాధా ?

రాధ : (మంచినీళ్ళతో వచ్చింది) పుస్తకా లెన్ని చదివారో అడుగు బావా ?

రఘు : మరిచిపోయాను. పుస్తకాలన్నిటినీ ఓ రోజు కాల్చి వేద్దామనుకుంటున్నా నన్నయ్యా. ఏదైనా పంటకి ఎరువైతే బావుణ్ణని.

శేషు ; అదేమిట్రా ?

రఘు : ఏమిటో రాధనే అడుగు. నా పుస్తకాలు నాచేతకాని తనానికి నిదర్శనం - యిదీ యిక్కడ నా బ్రతుకు-

రాధ : అలా అనుకోకపోతే చేస్తాననకూడదూ ? (లోపలకు వెళ్ళింది.)

రఘు : ఇన్నాళ్ళూ నేను కాకపోతే మరొకరు చేస్తున్నా రేమిటి? ఇన్నాళ్ళవుగా మీ మరదలు మాటలు ?

పరం : (వస్తూ) ఏమిటా విషయం ?

రఘు : ఇదిగో మిగతా మాటలు యీాయన చెప్తారు విను.

పరం : ఏమ్మిట్రా ? మాటలంటాడు వీడు ?

రఘు : నా చాతకానితనాన్ని గురించి మాట్లాడుతున్నాం.

పరం : సరి; పాతకథేనన్నమాట!– శేషూ! యిదేం కొత్తా నీకు? చెప్పాగా ?

రఘు : విన్నావా ? నా పనులీన్ని, నన్నూ నిందిస్తే నాకేబాధా లేదు. కాని నేను నీ లాగా లేనంటే నేనేం చేసేది ! అదెలా సాధ్యం ? నేను నీలా తయారవలేదని తిట్టడంలో అర్థం ఏమయినా ఉందా ?

పరం : అయితే మేమంతా నిన్ను తిడుతూ కూచున్నామంటావ్ ? అవేం మాట్రలా? మంచి చెప్తే తప్పా ?– 'శ్రీరామ' అంటే బూతుమాటఅయిపోతే ఎలా బ్రతకడంరా యీ యింట్లో?– ఒరే శేషూ! యిదిరా వీడి తంతు–

శేషు : (మాట్లాడడు. అతనికి యీ పరిస్థితి అంతా విచిత్రంగా వుంది)

రఘు : నీ గొప్పతనం నా కిష్టమే ! నే నొప్పుకుటాంను. అంత మాత్రాన ఏ విధంగా నేను వెధవనయానో అర్థంగాదు. సరేలే ! అవన్నీ పాతకథలు.

(రాధ వస్తుంది)

రాధ : ఇంక భోజనం చెయ్యరా ఏమిటి? వంటయింది. గంటనుంచి అత్తయ్య కూచుంది.

రఘు : వూ వచ్చేస్తాను. (పతి పెరట్లోంచి సంతోషంగా వస్తాడు)

పతి : నాకు నూరేళ్ళాయుష్షు అనుకుంటాను. శేషూ! ఎ ఫైన్ ఛాన్స్ టు యూ! (A fine chance to you!) అమ్మా రాధా! ఓ గ్లాసు మజ్జిగ...

శేషు : ఏమిటి మావయ్యా విశేషం?

పతి : ఉండరా ఫూల్ మొదట... ... అమ్మా లలితమ్మా, where is my sister? మా చెల్లెలు ఎక్కడ? — అన్నయ్యా (పిలిచి ప్రక్కనే వున్న పరంధామయ్యని చూసి) ఆఁ. నువ్విక్కడే ఉన్నావ్ కద?

రాధ : (వచ్చి) ఏమిటి బాబాయ్ అది?

పతి: చెప్తాగా? ఆ మూగివెధవ ఎక్కడ? కన్నా ... (వచ్చాడు) దట్స్ రైట్. వీడికి బోధపరుస్తే నేకాని తెలీదు కాబోలు (లలిత వచ్చింది) జాగ్రత్తగా వినండి అంతా.

పరం : నువ్వు చెప్పి చస్తేకదూ! వెధవ హంగామా నువ్వూను.

పతి : నోరు ముయ్యరా శకునపక్షీ! ఫ్రెండ్స్, రోమన్స్ అండ్ కంట్రీమన్. చెవులొగ్గి వినుడు. మన శేషు పెద్దవాడయిపోతున్నాడు – అవును మన శేషే!

పరం : ఏమిటి కథ?

పతి : విను మరి. సదరు శేషు—ఈ రోజు — అనగా 1958 మే 17 నుంచి యస్. యస్. మంకామూరు! షిప్ నేవి

గేషన్ కంపెనీ, టోక్యో, జపాన్, (S. S. 'Monka Maru' Ship Navigation Company, Tokyo, Japan లో పెద్ద ఆఫీసర్ అయికూచున్నాడు. జీతం నెలకి... ఊఁ ఎంత అయితేనేంలే — చదువు కొన్నవాడు. ఎలాగయినా బ్రతికేస్తాడయ్యా (శేషు) అదృష్టవంతుడివయిపోయావ్ పో. రాధమ్మా ! మజ్జిగ...

లలిత : నిజం అన్నయ్యా ?

పతి : చంపేశావ్. మీ అన్నయ్య ఎప్పుడన్నా అబద్ధాలు చెప్పగా విన్నావా ? (ఆగి) చెల్లాయ్ ! మాంచి ఫస్టుక్లాసయిన పాయసం చెయ్యాలివ్వాళ.

పరం : అదృష్టమంటే అలా ఉండాల్రా. శేషు సాక్షాత్తూ లక్ష్మీపుత్రుడు.

రఘు : అదృష్టవంతుడివిరా నువ్వు.

పతి : కాని one condition. ఒక్క షరతు.

శేషు : ఏమిటది ?

పతి : నువ్వు తక్షణం బయల్దేరి యివాళ సాయంకాలం వచ్చే ముఖర్జీగారి 'జలసారంగ్' లో ఎక్కెయ్యాలి. ఇవాల్టికి సరిగా పదిరోజులికి 'అరేబియన్ సీ' లో మీకు మంకామారు తటస్థపడుతుంది. అక్కడ నిన్ను 'రిసీవ్' చేసుకుంటారు వాళ్లు. అక్కడనుండి అబ్బా యిగారు అమాంతంగా టోక్యో, జపాన్... ఒరేయ్! నువ్వు చాలా లక్కీఫెలోవిరా. మొదట్లో యిన్ని

ఆపర్‌చ్యూనిటీస్ (opportunities) నాకూ రాలేదు.
జపాను వెళ్ళి నాకో మంచి ముక్కు పొడుం డబ్బా
ప్రజెంట్ చెయ్‌రా! (అంతా నవ్వుతారు)

రాధ : భోజనానికి లేవండి?

పతి : ఓయస్! దానికేం అభ్యంతరం లేదు. పదండి.

(అంతా లేచారు)

— తెర —

# ఆయిదవ రంగం

(ప్రదేశం. ఐదేళ్ళ తర్వాత అక్టోబరు నెలలో ఒకనాటి ఉదయం. వసారా చీకటి యింకా విడలేదు. దాదాపు 5-30 అవుతూంటుంది. తూర్పున రెండు మూడు తెలుపు చారలు కనిపిస్తున్నాయి.

బల్లమీద మసిబారిన దీపం యింకా వెలుగుతూనే ఉంది. బల్ల పాతబడి ఓ కాలు విరిగింది. పడకగది కర్టెన్ బాగా చిరుగులుపడి లోపల వ్యక్తులు కన్పించేట్టుగా ఉంది. లోపలకూడా ఓ దీపం వెలుగుతోంది. మడత కుర్చీ గుడ్డ పూర్తిగా మాసికలు పడింది. టేబిలుమీద పూలకుండీ ముక్కలయి అలాగే పడి ఉంది. దాంట్లో ఎప్పటివో కొమ్మలూ, పువ్వులూ ఎండిపోయి అలాగే ఉన్నాయి. మాసినబట్టలు ఓ ప్రక్క గుట్టగాపడి ఉన్నాయి. బల్ల దగ్గర ఉండే రెండు కుర్చీల్లో ఒక కుర్చీ లేదిప్పుడు.

మొత్తంమీద ఆ వాతావరణం బీదరికాన్నీ, నిర్లక్ష్యతనీ వ్యక్తం చేస్తోంది. సంవత్సరాలుగా చితికిపోయిన ఓ మధ్యతరగతి కుటుంబం. మంచిరోజులు జాగ్రత్తగా పరికిస్తే కనుపించక మానవు.

తెరలేచేసరికి ఎడమవైపు కుర్చీలో చలికి ముడుచుకపోయి కూర్చుంది రాధ. ఓ ఎర్రటి పాతశాలువ ఆమె గస్తుల్ని దాస్తూ కంటిచుట్టూ కప్పిఉంది. ఎంతో వయస్సు గడిచినట్టు కనిపిస్తోంది. తెల్లబారి, లోతుకు పోయిన కళ్ళూ, అన్ని కష్టాలకూ గురుకుజేరి, బండబారిన శరీరం-యిక ఏది వచ్చినా బాధలేదన్న నిర్లక్ష్యతా, విరక్తీ ఆ ముఖంలో స్ఫుటంగా కన్పిస్తున్నాయి. మాట్లాడితే కంఠం మందంగా, నీరసంగా, ఒక రణగొణధ్వనిలా వినవస్తుంది. అట్టే లక్ష్యం లేకుండా కట్టుకున్న చీరె, ఎన్నాళ్లనుండో సంస్కారం లేని శిలా, ఇప్పుడు నెరిసి, మట్టి కొట్టుకుపోయి రాగిలా ఎరుపెక్కి భయంకరంగా కన్పిస్తున్నాయి.

ప్రక్కనే పడుకొని గుర్రు పెడుతున్నాడు పరంధామయ్య.

కన్నా గోడని ఆనుకు కూచొని కునికిపాట్లు పడుతున్నాడు. వాడికి ఒక చెయ్యి విరిగి పోయింది. నల్లగా మాసిన బట్టల్తో, వాడిపోయి, నూనె కారే ముఖంలో, ముఖంమీద పడే జుత్తుతో భయంకరంగా తయా

రయాడు. ఆ నిద్రమత్తులో తూలి నేలన పడిపోతాడు. పూలిగినట్టు ఏడుస్తున్నాడు దీనంగా.

రాధ లేచి వాడి దగ్గరకు వచ్చింది. ఆమె ముఖంలో ఏ భావమూ కన్పించదు. మాట్లాడినపుడు కూడా ముఖంలో రంగు మారదు.)

రాధ : (నిర్లిప్తంగా) ఎందుకేడుస్తున్నావు కన్నా ?

(కన్నా తలెత్తి పడినవైపు చూచి ఏమీ చెప్పలేక ఉన్న ఒక్క చేత్తో కళ్ళు తుడుచుకున్నాడు)

రాధ : (వాడిదగ్గర కూచుంది - నేల మీద) చెప్పమ్మా — ఏం కావాలి నీకూ ?

కన్నా : (అన్నయ్యా గదివైపుచూచి ఏడ్చాడు ?

రాధ : అదా ! (రాధకూడా చలించింది. ముఖం చటుక్కున యిటువేపు త్రిప్పుకుని మెల్లగా అంది) అన్నయ్యకేం భయంలేదు కన్నా! బాగా రాత్రయింది. నిద్రపో... చెయ్యి ఎలా ఉంది ? ఏదీ చూడనీ...

కన్నా : (విరిగిన మొండిచెయ్యి జాచాడు జాలిగా)

రాధ : మరో వారానికి కులాసాగా ఉంటుంది. పడుకో—

(నుదటిమీద ముద్దు పెట్టుకుంటుంది.)

(పడక గదిలో ఎవరో లేచినట్టు శబ్దమైంది. మెల్లగా తలత్రిప్పి అటు వేపు చూచింది రాధ. ఒక క్షణం గడిచాక తలుపుని ఊతగా తీసుకుని నీరసంగా అడుగులేస్తూ రఘూ వచ్చాడు. తలా, గెడ్డం సంస్కారం లేకుండా పెరిగాయి. శరీరం ముడుతలు పడింది. వయస్సుతో కాదు, మోయలేని బరువుతో, బాధల్తో చివికి. అక్కడక్కడ శరీరంమీద ఎర్రటిమచ్చలు కన్పిస్తున్నాయి. కళ్ళు జ్వర తీవ్రతవల్ల ఎర్రగా మండుతున్నాయి— మాసిన చొక్కాతో ఉన్నాడతను.)

రఘు : (కుర్చీవేపు అతిప్రయత్నంతో నడుస్తూ అడిగా డతను) ఏమంటాడు వాడు ?

రాధ : (అతనివేపు చూడాలన్న ఉత్సాహం లేదిప్పుడు. లేచి వంటినిండా శాలువ కప్పుకొంటూ) మీకు వంట్లో బాగులేదని ఏడుస్తున్నాడు... (రఘూ కూర్చున్నాక) ఎలా ఉంది వంట్లో ?

రఘు : (మాట నిర్లక్ష్యం చేస్తూ కుర్చీలో వత్తిగిలాడు) ఇవాళ క్రొత్తా ఏమిటి ?

రాధ : దగ్గు తగ్గినట్టు లేదింకా ?

రఘు : (నీరసంలో కోపం) దగ్గు ! దగ్గు ! ! దగ్గు ! ! ! మీ కెవరికీ ఎప్పుడూ జబ్బుచెయ్యలా ? (మళ్ళీ దగ్గుతెర)

రాధ : (అంతకోపం తెచ్చుకున్నా చలించకుండా) అందరి లాగా మీరూ ఉంటే యింక కావలసినదేమిటి ?

రఘు : యిప్పుడు నాకేం హాయిగా ఉన్నాను.

రాధ : రగ్గు వంటినిండా కప్పుకోమని ఎన్నిసార్లు చెప్పాను ? చలివేస్తోంది. (తన శాలువతీసి కప్పబోతుంది.)

రఘు : అక్కర్లేదులే, వొళ్ళంతా కాలుతోంది. (చేత్తో మెల్లగా తోసేడు).

రాధ : (శాలువ తీసుకు కుర్చీమీద పడేసి పరాకుగా అలానే నిలబడిపోయింది.)

రఘు : (ఎంతసేపటికీ మాట్లాడకపోవడం చూసి) ఏవో కలలు కంటున్నావ్ ?—

రాధ : (ఆగింది. మళ్ళా ఏకవచనాన్ని గమనించి)

రఘు : శేషు గురించేనా? –

రాధ : (చటుక్కున యిటు తిరిగి) శేషు! శేషు!! ఎప్పుడూ అతనొక్కడేనా నా బ్రతుకులో సమస్య? (ఏదో పోయతలో ఉదాసీనత)

రఘు : (క్షణం ఆగాడు) మూడేళ్ళ క్రిందట అతనే మరి. ఇప్పుడేమో నీకే తెలియాలి.

రాధ : (ఉత్తేజంతో ఏదో అనబోయి, అంతలో ఏమనుకుందో ఏమో ఆగిపోయింది.)

రఘు : (ఈ గుంజాటన గమనించి నవ్వేడు) ఇదివరకయితే కోపంతో అరిచేదానివి. నీకూ ఆ ఓపిక తగ్గిపోయింది. అవునులే! కష్టాలు ఎలాంటివారినయినా క్రుంగదీస్తాయి.

రాధ : (మందు సీసా తీసుకువచ్చి గ్లాసులో పోస్తోంది.)

రఘు : అందులో మన కష్టాలు అన్నీ యిన్నీ కావు.

రాధ : ... ...

రఘు : (ఎంతో సేపటికి) పాప పోయి ఎన్నాళ్ళయిందంటావ్? (అతనిలోనూ దుఃఖం లేదు.)

రాధ : (చలించకుండానే) ఏమో?

రఘు : అంత త్వరగా మరచిపోగలిగావన్నమాట పాపని.

రాధ : జ్ఞాపకం ఉంచుకు చేసేదేముంది?

రఘు : నిజమే లే, ఈ గుండెధైర్యం లేకనే జీవితమంతా పాడు చేసుకున్నానేమో.

రాధ : హెచ్చుగా మాట్లాడవద్దన్నాడు డాక్టరు. మళ్లీ జ్వరం ముంచుకొస్తుందని...

రఘు : ఈ డాక్టరొకడు నా ప్రాణానికి. ఇతని మందు లేక పోతేనే యీపాటికి బాగయేది - నరాలు కోరికేసి, కోరికేసి డబ్బుగుంజి ప్రాణం పోయేవరకూ అవే మాత్రలు వేస్తాడు. వాడి మందుతోనే నాన్న పోయాడు. అమ్మా పోయింది... (కంఠంలో జీర) చివరికి పాపకూడా పోయింది — (కంఠంలో విరామం) యిక నేను మిగిలాను.

రాధ : (చలించలేదు. చివరి మాటకికూడా) ఆయన చెయ్యి గలిగినంతా చేస్తున్నాడు.

రఘు : చేస్తున్నాడులే! అన్నీ యినా ఈ డాక్టరుమాత్రం మిగిలాడు.

రాధ : ......

రఘు : (ఉన్నట్టుండి, నీరసంగా) నాకు చచ్చిపోవాలని లేదు రాధా!

రాధ : (ఆశ్చర్యంతో, అతని వేపు చూసింది.)

రఘు : నిజం. ఇంకా బ్రతకాలని ఉంది. ఏవో ఆశలు పీకు తున్నాయ్. మళ్లీ మన భవిష్యత్తును గురించి ఆశలు పెంచుకుంటున్నాను. మనకేమంత వయసు ముదిరిం దని?... ఏమంటావ్?

రాధ : ...

రఘు : నా మాటలమీదకూడా నమ్మకం పోయింది కదూ ?

రాధ : ... ...

రఘు : అవునులే, పోక ఏం చేస్తుంది? నామీద నాకే నమ్మకం లేదు. అయినా ఈ ఆలోచనలు పోవు. ఈసారి 'శేషు' రాగానే సిగ్గుపడకుండా డబ్బు అడిగి తీసుకుంటాను. అయిదువేలు చాలంటావా ?

రాధ : ... ...

రఘు : మాట్లాడు. (గట్టిగా మాట్లాడబోతే దగ్గు తెర ముంచుకొచ్చింది)

రాధ : ఊఁ... (మందు అందించింది)

రఘు : (పుచ్చుకొంటూ) అవును; అయిదువేలు చాలు; పట్నానికి పోదాం. ఈ వెధవ పొలం నా రక్తాన్ని, నా ఆనందాన్ని పీల్చేసింది. చదువు ఉపయోగం ఏమిటో అక్కడ చూపిస్తాను.

రాధ : ఇప్పుడామాటలెందుకండి ?

రఘు : అది కాదు రాధా ! నువ్వు నా చేతకానితనాన్ని చూసి సిగ్గు పడనక్కరలేకుండా చేస్తా నక్కడ. చూస్తావుగా !... ... ...(ఎంతో సేపటికి) కాని ఒక్క విచారం మిగిలిపోయింది—

రాధ : (అతనివేపు చూసింది - ప్రశ్నార్థకంగా)

రఘు : పాప పోయింది. మనలాంటి దరిద్రులయింట్లో ఎందుకు పుట్టిందో తెలీదు. యేడాది తిరక్కుండానే పాపిష్టి దేవుడు తీసుకుపోయేడు.

రాధ : (నిర్లిప్తంగా) పోవడం వల్లనే సుఖపడింది పాప.

రఘు : (నవ్వి) చస్తే అందరికీ సుఖమే. అలా అని చస్తున్నామా! అదీ నిజమేలే, అమ్మా, నాన్నా, అంతా పోయారు. ఈ పాపాన్నంతా మూటకట్టుకుని మనం మాత్రం మిగిలాం. (ఉన్నట్టుండి) మీ నాన్నతో చెప్పు - పాప నా పోలికల్తో పుట్టడం వల్లనే, రోగాల్తో పోయిందని ఎప్పుడూ వాగుతుంటాడు. ఓ ప్రక్క మనమే బాధల్తో, పైకి అనుకోలేక, ఏడవలేక, క్రుంగి పోతూంటే...(ఆ ఆలోచనల్తో కళ్ళనీళ్ళు తిరిగాయి) అలా అనడానికి వీల్లేదని చెప్పు.

రాధ : (సూటిగా) ష్! లేస్తాడాయన. మెల్లిగా మాట్లాడండి. లేచాడంటే నన్నే తిడతాడు.

రఘు : (దగ్గుతో వెనక్కి చేరగిలబడి కళ్ళుమూసుకుంటాడు. కాస్సేపటికి కళ్ళు తెరచి) ఆయన కోపమంతా నేను శేషు దగ్గర డబ్బు తీసుకోలేదనేగా?

రాధ : (పరాకుగా) తప్పేముంది? – అతని దగ్గర బోలెడంత డబ్బుంది.

రఘు : (విసుగ్గా) అవును? – యింకొకరి డబ్బు తీసికొందుకు మీకు మనస్సెలా ఒప్పుతుంది?.

రాధ : తప్పా? అతను మీ అన్నయ్యేగా?

రఘు : తీసుకునే ఉంటే ఈపాటికి నువ్వూ, మీ నాన్నా నన్ను మాటల్తో చంపేసేవారు. అన్నయ్యే కాదు, దేవు

డయినా సరే, అనవసరంగా పట్టిస్తే తీసుకోవటం నా కిష్టం ఉండదు. అదీ నా రకమూ...

రాధ : ఈ తరహాల్లో కూడ ప్రజలను చూస్తున్నాంగా...

రఘు : అదిగో మళ్ళీ... మాటలు ప్రారంభించావ్?... వచ్చిన పాములేస్తు.

రాధ : ... ... ...

రఘు : అవును. ఊరకంతా 'శేషూ! శేషూ!' అని కూస్తుం టావేం! ప్రతిదానికీ శేషు... నేను అసమర్థుణ్ణయినా, పొలం అమ్ముకోవాలన్నా, పంట పోయినా, అమ్మ పోయినా, నాకు జబ్బుచేసినా, పాప పోయినా, అన్నిం టికీ శేషు పోలిక...

రాధ : సత్తా కలిగిన వాడూ, అక్కరకు రాగలిగిన వాడూ గనుక అనుకొంటాం. అంతమాత్రాన బాధపడితే...

రఘు : నేను బాధపడ్డానా? ఊరికే అన్నాను... విరామం) ఇంతవరకు ఎక్కడ ఉన్నాడో ఉత్తరమే లేదు.

రాధ : సంక్రాంతికి వస్తానని వ్రాశాడు. తర్వాత యింకేమీ లేదు.

రఘు : ఈపాటికి లక్షలు గడించి ఉంటాడు. కాని మనం మాత్రం యీనరకంలోనే క్రుంగిపోతున్నాం. ఓప్రక్క పొలంతీనఖా, పన్నులబాకీ, అప్పులూ, వడ్డీలూ, యిదీ నే చేసిన నిర్వాకం. ఇదంతా వింటుంటే 'నామీద అసహ్యం పుట్టొచ్చు నీకు... నన్ను పెళ్ళిచేసుకొని నువ్వు పొరపాటుచేశావు రాధా!

రాధ : ... ... ...

రఘు : ఓ విధంగా నీ పతనానికి నేనే కారణం. ఇన్ని చేశాక నువ్వు నన్ను అసహ్యించుకొంటున్నావంటే నేను ఆశ్చర్యపడను.

రాధ : (భావరహితంగా) మిమ్మల్ని అసహ్యించుకోలేదు నేను.

రఘు : కాదు రాధా ! నువ్వు శేషుని మరచిపోలేవు.

రాధ : ... ...

రఘు : అయిదు సంవత్సరాల క్రితం నిన్ను నేను కొట్టబోయిన రోజు గుర్తుందా ? ఆనాడు అదేమాట అన్నావు.

రాధ : ... ...

రఘు : అయినా నీమీద నాకేం కోపంలేదు రాధా !... ... నీదేం తప్పులేదు ...

రాధ : (ఉద్వేగంతో) నన్నెందుకిలా హింసిస్తారు ?

రఘు : రాధా !

రాధ : (ఆవేశాన్ని ఎంతో ప్రయత్నం మీద ఆకట్టుకుంటుంది. వచ్చే దుఃఖాన్ని పెదాలతో ఆపుకుంది.) ఇప్పట్లో నేనేం అన్నా మీ మనస్సును పాడుచెయ్యడమే అవుతుంది. శేషు, శేషు, శేషూ అని మాటల్తో చంపేసేకంటే ఒక్కసారి ప్రాణం తీయండి...

రఘు : (క్షణం విస్తుపోయి, నవ్వేడు.)

రాధ : (ఆ నవ్వు మనస్సుని మరీ గాయ పరిచింది) ఇప్పట్లో నేనేం చెప్పినా నమ్మరు మీరు. మీకొక నమస్కారం చేస్తాను. ఇంకెప్పుడూ అలా మాట్లాడకండి.

రఘు : నువ్వు పిచ్చిదానవవుతున్నావు రాధా ! ఇప్పుడంతా నీకు తమాషాగానే కన్పిస్తుంది. యీ పరిస్థితులూ, యీ మనుష్యులూ, యీ కష్టాలూ అంతా నవ్వు తెప్పిస్తాయి కూడాను.

రాధ : కాస్సేపు లోపల నిద్రపొండి. మనస్సు కుదుట పడుతుంది.

రఘు : మన భవిష్యత్తువిషయం ఆలోచించాను రాధా ?

రాధ : ఇదొకటి – ఈ ఆలోచనలే మన జీవితమంతా తినేశాయి.

రఘు : రాధా ! నిన్నొకటి అడగాలని ఉంది.

రాధ : (చూస్తోంది)

రఘు: (దీనం గా ప్రాధేయపడుతూ) నన్నెప్పుడూ అసహ్యించుకోకు రాధా! నీచల్లటి మాటవుంటే చాలు. ఏదయినా సహిస్తాను. ఎంత పనయినా చేస్తాను. ఇంకెంత? ఇప్పటికే వాళ్ళంతా తేలిక పడింది. చూడు కావలిస్తే ...(లేచాడు – కాని వెంటనే తూలిపోయాడు రాధ ఆపింది, ఆనుకొని)

రాధ : నా మాట వినండి. నిద్రపొండి. కాస్సేపు నిద్రపోతే మనస్సుకి శాంతి ఉంటుంది. ఆ డాక్టరు వచ్చేసరికి మీరు మరీ దిగజారిపోతే ఎలా చెప్పండి ?

రఘు : రాధా! ఇక. ఏ డాక్టరూ అక్కర్లేదు రాధా! నీ మాటలు చాలు. ఇవాళ నాకెంతో సంతోషంగా ఉంది. (ఏదో గుర్తుకొచ్చి చుట్టూ చూసి ఖాళీకుర్చీని గమనిస్తూ ఆగిపోయాడు) మా అమ్మ గుర్తు కొస్తోంది.

రాధ : (అతను చూడకుండా తల పక్కకి తిప్పి కళ్ళు తుడుచుకొంది)

రఘు : బ్రతుకులో అన్నీ పోగొట్టుకున్నాను రాధా! కాని ఈ మనస్సు మాత్రం మిగిలింది. ఒక చల్లని మాట చాలు, నేను బ్రతకడానికి.

రాధ : ఇహ పదండి, పడుకుందురు గాని.

రఘు : అప్పుడే వద్దు రాధా!- నీతో యివాళంతా మాట్లా డాలి. ఈ అవకాశం మళ్ళీవస్తుందో లేదో తెలీదు. వెలుగురానిదే నిద్రపోను నేను. ఇంకా మన భవి ష్యత్తు గురించి......

రాధ : అలాకాక్కడండి. నామాట వినండి. మీరు నిద్రపోక పోతే నామీద ఒట్టే...

రఘు : నీది మరీ చిన్నతనం! - సరే పద. నీగురించి నిద్ర పోతాను.(గదిలోకివెళ్ళి) తలుపులు దగ్గరగా వేసెయ్. హాయిగా కలలు కంటూ నిద్రపోతాను.

(రాధ తలుపులు వేసి, క్షణకాలం ఆగి, అతను పడుకున్నాడని రూఢి చేసుకున్నాక తొందరగా తండ్రిని లేపింది.)

పరం : (మెల్లగా ఆవులిస్తూ లేచి ఓసారి లోపలికిచూసి పుస్తకం వేసి స్థిమితంగా చుట్టవెలిగించాడు) అంతా వింటు న్నానమ్మా! అన్నీ పోయినా కంటు మాత్రం పోలేదు వీడికి!

రాధ : అదేమిటి నాన్నా, అలా అంటావ్?–ఆయన మాటలు వింటూంటే నాకే భయమేసింది. ఆయన ముఖం చూడలేదు నువ్వు. నల్లబడి, భయంకరంగా వున్నారు. లేస్తే తూలిపోతున్నారు. దగ్గు ఎక్కు వయింది. మాట తడబడుతున్నారు.

పరం : ఇంతకీ ఇలాంటివాణ్ణి పెళ్ళిచేసుకోవడం నీ దౌర్భా గ్యం అంటాన్నేను.

రాధ : ఆయన జబ్బుతో వుంటే యిప్పు డివేం మాటలు నాన్నా?—

పరం : (విసుగు, కోపం) జబ్బు—జబ్బు—జబ్బు. ఎప్పుడు లేదమ్మా జబ్బు? ఒక్కటి చెప్పు, ఎప్పటికప్పుడు నేను ఋణమో, పణమో యిచ్చి సాకకపోతే యీ యింట్లో యీ నాలుగు నెలల్లో రోజుగడిచేదేనా? వాణ్ణేమీ అనొద్దని నువ్వు కూచుంటావు. ఎవర్నీ ఏమీ అడగ నని వాడు కూచుంటాడు. బికారికోపం ఎక్కు వన్నట్టు కస్సు బుస్సు లాడడం పయిగా దర్జా ఒకటి బాబుగారికి. ఎవర్నీ చేయిజాపి అడగడు. ఏమీ? రక్తంలో రక్తం, ఓ తల్లి కడుపున పుట్టాడు కదా? జేబులోంచి లాక్కోవలసింది పోయి, "ఒరే అన్నా

యింత డబ్బియ్యి!" అని అడగడం తప్పా? ఇంతకూ నేనూ వాడికేమన్నా ఋణం ఉండిపోయాను, నా డబ్బూ మంచి నీళ్ళ ప్రాయంగా ఖర్చయిపోయింది.

రాధ : విచారించకు నాన్నా! బావ రాగానే నీడబ్బు నీకిచ్చే యమంటాలే.

పరం : ఆ.... బావ అంటే గుర్తుకొచ్చింది. పీడి ఆరోగ్యం ఎలా ఉంటున్నాడు డాక్టరు? అది చెప్పు ముందు.

రాధ : ఏముంది? రోజురోజుకి మరీ భయంకరంగా తయారవుతున్నారు. మరీ దిగజారి పోతున్నారు. నువ్వు చూస్తున్నావుగా?

పరం : ఎండిపోయి ఎముకలు పెళ్ళుకొచ్చాయి. అప్పుడు మరి. వచ్చింది మహమ్మారి రోగం. ప్రాణం తీసుకుని కాని వదల్దు. దీని సిగతరగ.

రాధ : ఏం మాటలు నాన్నా?

పరం : నా మాటలు కావమ్మా! దీని తంతు అది. ఇంతకూ నువ్వు దురదృష్టవంతురాలివయి పోయావమ్మా!

రాధ : (ఒక్కసారి దుఃఖం వచ్చి రెండు చేతుల్తో ముఖం కప్పుకుని ఏడ్చింది)

పరం : ఏడుస్తూ కూచుంటే పనులు జరుగుతాయా అమ్మా!– స్థిమితంగా మంచేదో, చెడేదో చూసుకోవాలి. అయినా యిప్పుడేం?

రాధ : ఏమో నాన్నా, ఆయన రోగం.

పరం: వాడి రోగమూ సరే, వాడూ సరే. నేనోమాటచెప్తాను. వింటావా ?

రాధ : చెప్పు.

పరం : మన శేషు ఉన్నాడే - వాడిప్పుడు కన్ను కదిపితే కనకవర్షం కురుస్తోంది. అవునా ?

రాధ : ... ...

పరం : (మౌనం అంగీకారంగా భావించి)అవును కద. గుండె దిటవు చేసుకో. నువ్వు కుర్రదానివి. అశుభం శుభం నువ్వేం చేశావు ? ... ఏం చూశావు ? మొన్న ఆ నలుసు పోవడం తప్పిస్తే—అంచేతనే చెప్పేదేమి టంటే ...

రాధ : (ఏదో కీడు పొడగట్టడంతో కరుకుగా అంది) ఏమిటి ?

పరం : అలా కసురుకోకు రాధ తల్లీ ! చెప్పేది విని వంట పట్టించుకో. వీడు, వీడున్నాడే-నోటితో అనకూడదు గాని-దురదృష్టవంతుడయి పోతున్నాడు.

రాధ : అబ్బ !

పరం : అంచేత—చెప్పొచ్చేదేమిటంటే - పోయేవాళ్ళతో పోలేం గనుక - మన బ్రతుకులు మనం బ్రతకాలి కనుక - ఏవమ్మా - అర్థమయిందా ?

రాధ : (భయపడింది అతని మాటల్లో స్ఫురిస్తూన్న అర్థానికి) ఏమిటి ?

పరం : మన బ్రతుకులకు ఒకే ఆశ మిగిలిందమ్మా – శేషు—శేషూ నీడన ఉంటేనే మన కన్నీను – మనసులో ఉంచుకో యీ మాట.

రాధ : (ఆవేశంతో అరిచింది) నాన్నా !

పరం : ఎందుకమ్మా అలా బెదిరిపోతావ్ ? చెప్పగానే నువ్విలా తిరకాసయి పోతావని నాకు తెలుసు. నీదసలే పిరికి గుండె, కాని ఆలోచించు.

రాధ : (కోపంతో ఉక్కిరి బిక్కిరయి) ఛీ !–ఎంత దరిద్రులు పోగయారు నాచుట్టూను. నీ కిలాంటి మాటలు ఎలా తోచాయి నాన్నా?–తోచినా ఎలా అనగలిగావ్ ? – నీ నోటికి వచ్చిందల్లా అనెయ్యడమేనన్నమాట ! – ఎవరన్నా నీతో అన్నారా ?– శేషుని ప్రేమిస్తున్నట్టు నీకు తోచింది – (ఇక దుఃఖం ఆపుకోలేక పోయింది.) ఇలా నన్ను మీరంతా మాటల్తో చంపేశారు. రాయిగా మార్చేశారు. నువ్వసలు నాతండ్రివే కాదు. నిన్ను కాల్చెయ్యాలి. అవును – నిలువునా కాల్చెయ్యాలి–(మాట్లాడుతూనే ప్రక్కన బల్లమీద ఉన్న దీపం అందుకుంది. పరంధామయ్య భయపడ్డాడు. ఆ ఆవేశంలో ఏం చేస్తున్నదో తెలీకుండా దీపంలో కిరసనాయిలు అతనిమీద వంచేసింది) మీరంతా పోతే యీశాపాలూ, యీదుఃఖాలూ, యీబాధలూ అన్నీ పోతాయి. నీలాంటి వెధవతండ్రి నాకక్కర్లేదు–

పరం : (పూర్తిగా బెదిరిపోయేడు నేలనపడి ఏడుస్తున్నాడు. ప్రాధేయపడుతున్నాడు. మొత్తుకుంటున్నాడు,ఓరాన్నాయనో చంపేశావే ! – అమ్మా – రాధతల్లీ ! నీకో నమస్కారం చేస్తాను. నేరకపోయి అన్నాను. ఏమిటి సాధనం? చచ్చి నీకడుపున పుడతానే– ముసిలిముండా వాణ్ణి–అమ్మా–అమ్మా– రాధమ్మా—

(కన్నా లేచి ఏడుస్తున్నాడు. ఇంతలో తలుపు తోసుకు హఠాత్తుగా శేషు వచ్చాడు. చేతిలో పెట్టె వుంది. వెనుకనే డాక్టర్ రజనీకాంత్. రాధ, పరంధామయ్య పరిస్థితిని చూసి నిర్ఘాంతపోయాడు).

శేషు : (గొణిగాడు) ఏమిటి రాధా యిది?

రాధ : (తడబడుతున్న గొంతుతో) ఏముంది?– యిలాంటి తండ్రితో రోజూ పడుతూ లేస్తూండడం – కాలు జారింది– దీపం తెచ్చాను–...

పరం : అవునురా... కాలు జారింది ... బుద్ధి వచ్చింది–వాడికి దీపం చూపమ్మా– నామాటకేం– (లేచి లోపలికి ఒక్క ఉదుటున పారిపోయేడు. శేషు రాధ ముఖంలో తడబాటు గమనించినా తన ఆతృతలో అదేం పట్టించుకోలేదు. రాధ దీపం టేబిలుమీద ఉంచింది).

శేషు : (కోటు విప్పుకుంటూ) తమ్ముడెక్కడున్నాడు? ఆ గదిలోనా?

రాధ : ఊఁ.

శేషు : పదండి డాక్టర్!– ఆ దీపం తీసుకురా రాధా!–గదిలో చీకటిగా ఉన్నట్టుంది–(డాక్టరు వెనకగదిలోకి వెళ్ళాడు.

వెనక దీపంతో రాధవెళ్ళి వెంటనే తిరిగి వచ్చేసింది. తలపట్టుకు కుర్చీలో కూలబడింది. కళ్ళవెంట అప్రయత్నంగా నీళ్లు కారుతున్నాయి. మరికాస్సేపటికి శేషు బయటికి వచ్చాడు. అతని ముఖంలో భయం, వణుకు, కోపం— మాట్లాడకుండా కుర్చీలో కూచున్నాడు. మరికాస్సేపటికి మాట్లాడగలిగాడు) ఇదంతా ఎన్నాళ్ళబట్టి జరుగుతోంది?

రాధ : ఏది?— ఆయన జబ్బేనా?

శేషు : అదే— మరింకేమిటనుకున్నావ్?

రాధ : క్రితం వేసవికే పూర్తిగా దిగజారిపోయారు. ఆరు నెలలక్రిందట పాప పోయేక మరీను.

శేషు : (దిమ్మరపోయి) పాప పోయిందా?

రాధ : నీకు వ్రాయలేకపోయేం.

శేషు : చేతకాకా? డబ్బులేకా?

రాధ : రెండూనూ.

శేషు : (పూర్తిగా విచలితుడయి, గొణిగాడు) పా... ప ... పోయింది—

రాధ : నెలక్రితం కన్నా చెయ్యి కోతబండిలో పడి విరిగింది.

శేషు : (పిడుగుపడ్డట్టయి "కన్నా!" అని అరిచాడు).

రాధ : అక్కడ పడుకొన్నాడు (అటు చూపింది).

(నీరసంగా మూలన చేరబడి ఉన్నాడు కన్నా. వాడివేపు వెర్రిగా చూశాడు శేషు. ఒక్కసారి వాణ్ణి కౌగలించుకు ఏడ్చాడు).

శేషు : (ఉన్నట్టుండి Burst అయి) ఇన్నాళ్ళూ నాకెందుకు చెప్పలేదు? నేను చచ్చిపోయాననుకున్నావా? ఒక్క ఉత్తరం వ్రాయడానికన్నా తీరికలేదా మీకు? లేకపోతే (రఘూ గదివేపు చూపుతూ) వీణ్ణి ఇలా రోగంతో కుళ్ళబెట్టి చంపేద్దామనుకున్నారా?— ఛీ! ఛీ!! — పాపం వాడిని చూస్తేనే జాలివేస్తోంది. సంవత్సరం నుంచీ ఏ జబ్బో తెలీక, కనుక్కునేవాడూ, మందిచ్చే వాడూ లేక, సరైన గాలీ, వెలుతురూ రాని ఆ మురికి కూపంలో పడివుండడం— అబ్బ!— దారుణం!

రాధ : ఒకటి రెండుసార్లు నీకు ఉత్తరం వ్రాస్తానన్నాను. కాని అన్నప్పుడల్లా ఆయన పిచ్చెత్తినట్టు అరిచేవారు నీ సహాయం అడగడానికి అభిమానం. "ఎవరిన్నీ చెయ్యి చాచి అడగను." అనేవారు.

శేషు : అడగడూ! నన్నుకూడా అడుగడూ! (లేచి పచార్లు చేస్తాడు). అసలు మీరంతా ఏంచేసారో నాకు తెల్సు. వాడిప్పుడు ఎటువంటి పరిస్థితిలో ఉన్నాడో తెల్సా? వాణ్ణి చూసేసరికే నాకు వణుకు పుట్టుకొచ్చింది. జబ్బొస్తే అదే పోతుందిలే అని మీరంతా పెడ మొహం పెట్టారు. అదిప్పుడు ముదిరిపోయింది. అసలు మీరు యీ ఆరునెలల్లో నాకు ఒక్క ఉత్తరమయినా ఎందుకు వ్రాయలేదు చెప్పు? ఏమిటి మీ ఉద్దేశం?

రాధ : ఎలా వ్రాయమంటావు? ఉత్తరం వ్రాయడానికీ, టెలిగ్రాం ఇవ్వడానికీ మాదగ్గర డబ్బు లేదు. అందరికీ

యిప్పటికే అప్పులుపడి ఉన్నాం. నాన్నకూడా యివ్వడం మానేశాడు. ఇప్పటివరకూ నాన్నే అంతో, ఇంతో ఇచ్చేవాడు. ఆయనకి తెలీకుండా కూడా తీసుకునేదాన్ని. యిప్పుడదీ లేదు.

శేషు : అయితే యిప్పుడు నా కెలా తెల్సిందంటావ్ ?

రాధ : ఏమో నాకు తెలీదు.

శేషు : నాకు ఎవరు టెలిగ్రాం ఇచ్చారో తెలుసా ?

రాధ : ఎవరిచ్చారు ?

శేషు : (ఆవేశంతో) రాధా !- వాడు నీ భర్త- డబ్బుకాదు సరికదా, ప్రాణం పోయినాసరే, ఎన్నివేలమైళ్ళలో ఉన్నా నాకు కబురు చేయడం నీ బాధ్యత. అది పోయింది. ఇక్కణ్ణుంచి కనీసం ఉత్తరమైనా వ్రాయలేక పోయావ్. ఇదిగో ! నోరూ, చెయ్యీ లేని వీడు (కన్నానిచూపి) యీ కన్నా టెలిగ్రాం యిచ్చాడు. చూడు కావలిస్తే-

రాధ ? (దిమ్మెరపోయి) కన్నా యిచ్చాడా ?

శేషు : అవును కన్నాయే. మనస్సుంటే ఎన్నిమార్గాల్లేవు. ఈ అపాయంలో వాడొక్కడు ఆదుకున్నాడు. (కన్నా దగ్గరకు వచ్చి)కన్నా!- ఈ టెలిగ్రాం ఎలా యిచ్చావ్ నాకు ? (సంజ్ఞతో అడిగాడు).

రాధ : నువ్వెక్కడున్నావోకూడా తెలీదు మాకు.

శేషు : మరి వీడికెలా తెల్సింది ? - ఏం కన్నా ? ఎలా వ్రాయించావు దీన్ని ?

(ఒకసారి అన్నయ్య ముఖం చూసి లోపలికి వెళ్ళి పెద్ద ఉత్తరాలకట్ట తీసుకొచ్చాడు. అందులో వెదికి ఒక ఉత్తరం (foreign letter) తీశాడు. మరి రెండు ఉత్తరాలుకూడా చూపించాడు. అవన్నీ చూశాడు శేషు. అంతా చదివాక నిర్ఘాంతపోయాడు. ఒక్కసారిగా కన్నాని కౌగలించుకున్నాడు.)

శేషు : నువ్వొక్కడివి నాకు సహాయం చేశావు కన్నా! చూశావా రాధా! చెయ్యాలనుకుంటే డబ్బే ప్రధానం కాదు. ఇన్నేళ్ళు తిండిలేక బ్రతికారా? ఒక్క మాట నాతో చెప్తే? – ఒక్కసారి నాకు కబురుపంపిస్తే? – యింతడబ్బుతో నేనున్నానుగా? మీకు ఆమాత్రం సహాయం చెయ్యడానికి కాకపోతే నాకెందుకీ డబ్బు? అసలెందుకిలా జరిగింది? వీడి చెయ్యి ఎలా విరిగింది? పొలం ఏమయింది? అప్పుడు నే నేర్పాటు చేసిన మనుషులేమయారు?

రాధ : విత్తు పాడయిందనీ, పొలం గట్టుపడిందనీ యిలా అప్పుడప్పుడూ డబ్బు గుంజుకు పోయారు. ఇంట్లో వస్తువులన్నీ అమ్మేశాం. పాప పోయాక ఆయన మరీ దిగజారిపోయారు. పొలం పోయింది. ఇల్లు తనఖా పడింది. లక్ష్మయ్య జప్తుచేయడానికి వస్తే కాళ్లు పట్టుకు పరువు నిలబెట్టుకున్నాం. అన్నీ పోయాయి. పుస్తకాలూ, ఆయనా, నేనూ మిగిలాం.

శేషు : (ఇవన్నీ వింటూ వణికిపోయాడు) ఇవన్నీచూస్తే వాడికి పిచ్చెత్తి ఉంటుంది. నన్నడగడానికి సిగ్గా? ఏమిటి వాడి ఉద్దేశం? (హఠాత్తుగా ఆమె వేపు

తిరిగి) రాధా! నిజంగా వాడికి పిచ్చెక్కిందా యేమిటి?

రాధ : (Dully గా) పాపచచ్చిపోవడం ఆయన్ని మరీ పాడు చేసింది. అప్పట్నుంచీ అలానే ఉన్నారు.

శేషు : అయితే మీరీ మనిషికి అలవాటు పడిపోయారన్న మాట!

రాధ : (జీవంలేని గొంతుతో) దేనికయినా చలించనిరోజు ప్రతివారికీ వస్తుంది బావా! మాకు ముందుగానే వచ్చింది.

శేషు : (ఆమెవేపు క్షణకాలం సూటిగా చూసి) నన్ను క్షమించు రాధా! ఇక్కడి పరిస్థితులన్నీ సరిగా అర్థం చేసుకోలేదు నేను. నిన్ను అనవసరంగా మాట లన్నాను. రఘుని అలాంటి పరిస్థితిలో చూసేసరికి మతిపోయింది.

రాధ : క్షమించడానికేంలే.

శేషు : ఇంకా పుట్టిమునగక మునుపే ఇల్లు చేరుకున్నాను. కాస్త నయం. ఏదెలా చెయ్యాలో ఈ డాక్టరుకి బాగా తెల్సులే. ఇక మిగతావిషయాలు ఆలోచించాలి. రఘూ కోలుకోగానే పొలం మళ్ళీ కొంటాను. ఆ పనంతా నేనే చూసుకొంటాను. మంచి పనివాళ్ళను పెట్టి సాగుచేయిస్తాను...

(డాక్టరు గదిలోంచి వచ్చాడు. అతని ముఖంలో నిరాశ, నిస్పృహ కన్పిస్తున్నాయి.)

శేషు : ఏం డాక్టరు ?

రాధ : ... ... ...

శేషు : (పెదాలు తడిచేసుకున్నాడు. భయంతో పెదాలు వణుకుతున్నాయి) కూచోండి. (కుర్చీ ముందుకు తోశాడు)

రజని : తొమ్మిది గంటలకు బండివుంది శేషూ. తప్పదు మరి.

శేషు : మా తమ్ముడి విషయం...

రజని : రెండు మూడు విషయాలు చెప్పిపోతాను. (రాధ వేపు అర్థయుక్తంగా చూస్తాడు.)

రాధ : (గ్రహించి నవ్వుకుంది) మీ రనేది నాకర్థమయింది డాక్టరుగారూ?— (Dull గా) పర్వాలేదు చెప్పండి. నేనూ తమాయించుకో గలను. ఆయన చివరి ఘడియల్లో ఉన్నారు. అంతేగా మీరు చెప్పేది ?

శేషు : (కోపంగా అరిచాడు) రాధా !

రజని : నేనూ అదే చెప్పాలనుకుంటున్నాను శేషూ. ఐ యామ్ సారీ—

శేషు : డాక్టర్ !

రజని : మీరు స్థిమితపడండి. ఇప్పట్లో ఏం చేసినా లాభం లేదు. సమయం మించిపోయింది.

శేషు : అదికాదు డాక్టర్ ! మీ రెలాగయినా...

రజని : చెప్పానుగా ? బహుశా కొన్నిరోజులు— కాకపోతే కొన్నిగంటలు - అంతే...

శేషు : డాక్టర్ !

రజని : రెండు ఊపిరితిత్తులూ పూర్తిగా చెడిపోయాయి. నామటుకు నాకే కొత్త, ఇంత ముదిరిన కేసు చూడడం. రోగమింత ముదరడం దౌర్భాగ్యమేమరి——

శేషు : (శారద వేపు చూశాడు. ఆమె తలవంచుకుంది. ఆమెలో దుఃఖంలేదు) ఇంకేం చేయగలిగింది లేదా డాక్టర్ !

రజని : ఆత్మత అలా అనిపిస్తుంది మీకు.

శేషు : అందరూ పోయారు నాకు. అమ్మా, నాన్నా, అంతా పోయారు. వీడొక్కడూ మిగిలాడు. డాక్టర్ ! నా డబ్బంతా యిస్తాను.........

రజని : డబ్బుతో ప్రాణం కొనుక్కోగలమా చెప్పండి, మీ పిచ్చిగాని.

శేషు : ఇంకేం చెయ్యను ? - డాక్టర్ ! మరొక్కసారి రోగిని చూడండి. ఏదైనా చివరి ఆశ ఉండకపోదు. బెంగుళూరు శానిటోరియంకు తీసుకు వెళ్ళమన్నా తీసుకు వెళ్తాను. చివరకు నా ప్రాణమన్నా యిస్తాను...(ఆగి) పోనీ Ohio వెళ్ళమంటారా డాక్టర్ !- ప్రపంచంలోకల్లా గొప్పగొప్ప డాక్టర్లు అక్కడున్నారు.

రజని : (నవ్వి) మరీ పిచ్చివాళ్ళుకాకండి మీరు. ఇప్పట్లో ఈ మాటలు రోగితోమాత్రం అనకండి. మరొక్క మాట. మీ మనస్సుకి బాధకలిగినాసరే చెప్పక తప్పదు. మీరుకూడ రోగిని అంటిపెట్టుకు ఉండడం మంచిదికాదు. రోగం చెడ్డది.

శేషు : భగవాన్ ! (తల కుర్చీకి కొట్టుకున్నాడు బలంగా. (రాధ ఆపిందతన్ని)

రజని : క్షమించడమ్మా—వస్తాను.

రాధ : (నిర్లిప్తంగా) మంచిదండి.

శేషు : (యాంత్రికంగా లేచి) కారుదాకా వస్తాను. పదండి డాక్టర్ ! (ఇద్దరూ వెళ్లారు. కాస్సేపటికి శేషు వచ్చాడు. అతని ముఖం నల్లబడింది. కుర్చీలో కూర్చుని రెండు చేతుల్తో ముఖం కప్పుకున్నాడు. ఏడుస్తున్నాడు.)

రాధ : ఊరుకో బావా !

శేషు : ఇప్పుడెలా రాధా! మన ముఖం చూడగానే అంతా గ్రహించేస్తాడు తమ్ముడు. ఎలాంటి కష్టం వచ్చి పడింది !

రాధ : (చాలాసేపటికి అంది) ఇప్పుడేం చేద్దాం?–చివరి క్షణం వరకూ యిలా కూర్చోవడం తప్పిస్తే?

శేషు : (నిశ్చయంగా) అలా వీల్లేదు రాధా ! డాక్టరు చెప్పినంతగా చెడిపోలేదు పరిస్థితి. వీడు తప్పకుండా బాగుపడతాడు. బెంగుళూరు శానిటోరియంకి వెళ్దాం. వీడు తప్పకుండా బాగుపడతాడు.

(రఘూ వచ్చాడు. దారిలో పడుకున్న కన్నా చెయ్యి తొక్కాడు. విరిగిన చెయ్యి తగలడంతో బాధతో లేచి మూల్గాడు కన్నా. రాధ, శేషూ త్రుళ్లిపడి అటువేపు తిరిగారు. రఘూ తమ్ముడి దగ్గర చదికిలపడ్డాడు.)

రఘు: నిన్ను చూడలేదు కన్నా - చివరికి నిన్నూ బాధ పెడుతున్నాను.

శేషు : (భయంతో అరిచాడు) రఘూ!- (దగ్గరికి వచ్చి) మంచం మీంచి ఎందుకు లేచావురా నువ్వు? అది మంచిది కాదు.

రఘు : డాక్టరు ఏం చెప్పాడన్నయ్యా?

శేషు : పరవాలేదన్నాడు. బెంగుళూరు శానిటోరియంకు...

రఘు : (నవ్వి) నిజమా రాధా!

శేషు : నే చెప్తున్నాగా?

రఘు : రాధ చెప్తే నమ్ముతాను.

రాధ : నిజమేనండి.

రఘు : (నవ్వి) అయితే రెండోసారి అబద్ధం చెప్తున్నావన్న మాట?

శేషు : నిజం రఘూ - నువ్వు మళ్ళీ ఆరోగ్యంగా ఉంటావు. అసలు ఎందుకొచ్చావ్ ఆ గదిలోనుంచి-పద, పద.

రఘు : రాక అక్కడే చావమన్నావా? -(విసుగుతో, దుఃఖంతో) పదేళ్లు జైల్లోలాగ ఆ గదిలో పడి ఉన్నాను. ఆ గదిలోనే నాఆశలన్నీ తుడిచిపెట్టుకు పోయాయి.

శేషు : ఇప్పుడెందుకు ఆ మాటలు... పద...

రఘు : ఇప్పుడు కాకపోతే యింకెప్పుడు ...నాకిక 'తర్వాత' లేదు! జరగబోయేదంతా కళ్ళల్లో కదుల్తోంది.

రాధ : పడుకోండి కాస్త స్థాయి కుదురుతుంది.

రఘు : అన్నీ తెలిసిన నీకూ భ్రమ రాధా!-నా ముఖం చూసి చెప్పు? - నేనింకా బ్రతుకుతానంటావా?

శేషు : ఎందుకురా మమ్మల్నిలా ఏడిపిస్తావ్ ?

రఘు : అదొక్కటే నాకు తెలిసిన విద్యఅన్నయ్యా - రాధ నడుగు. (విరామం) నీకో విషయం చెప్పాలనుకుంటున్నాను.

శేషు : తర్వాత చెప్పువుగానిలే. ముందు పద.

రఘు : అదిగో మళ్ళీ. నన్నిలా కబుర్లతో మభ్యపెట్టకు. ఘడియలోనో, గంటలోనో కళ్ళుమూస్తే మళ్ళీ చెప్పే అవకాశం ఉండదు.

శేషు : చెప్పయితే.

రఘు : నన్ను నమ్మినందుకు యిన్నేళ్లూ బ్రతికినందుకు రాధకు ఏపాటి సుఖమూ యివ్వలేకపోయాను. దీని చివరి రోజులు ఎలా గడుస్తాయో అన్నబాధ నన్ను తినేస్తోందిరా -

శేషు : అదేమిటి రఘూ! మేమందరం లేమూ?

రఘు : (నవ్వి) నాకు తెల్సులే.

రాధ : పడుకోండి కాసేపు. మీ మనస్సేం బాగులేదు.

రఘు : అవును. నిద్రపోవాలి. (లేవబోయి తూలిపోయేడు) లోపలికి తీసుకువెళ్ళన్నయ్యా. ఎముకలన్నీ విరిగిపోతున్నట్టు నొప్పిలేచింది. నా అవయవాలుకూడా నన్ను లక్ష్యపెట్టడం మానేస్తున్నాయి. గుండెలో మంటలు. ఇన్నాళ్ళ తర్వాత చచ్చిపోవాలన్న మొదటి కోరిక...

రాధ : (ఇంతసేపటికి రాధ మొదటిసారిగా బావురుమని ఏడ్చింది. శేషు అతన్ని లోపలికి పంపి తలుపులు దగ్గరగా మూసి వచ్చాడు.)

శేషు : పిచ్చిగా ఏదో మాట్లాడుతున్నాడు. ఇప్పుడేం చెయ్యడం ?

రాధ : ఆయన మాటలు వినడం నాకెప్పుడూ అలవాటే. కాని యివాళ మరీ విచిత్రంగా మాట్లాడుతున్నారు.

శేషు : వాడి మనస్సులో ఏదో సముద్రం ఉంది.

రాధ : ఆయన పోయాక నేను హాయిగా ఉండాలనుకుని ఉంటారు.

శేషు : అదికూడా కాదు. చెప్పకపోయినా మేమంతా నిన్ను ఆదరిస్తామని తెల్సు—

రాధ : (తటపటాయిస్తూ) ... అయితే...

శేషు : ఏం ? ఆగిపోయావేం ?

రాధ : అహఁ ! ఏం లేదు.

శేషు : ఏం లేదూ ? (అనుమానం కలిగి) నాముఖం చూసి చెప్పు.

రాధ : ఏం లేదు బావా ?

శేషు : (నమ్మక) వాడి మనస్సులో బాధేమిటో నువ్వు దాస్తున్నావు రాధా? ఇలా దాచి దాచి వాణ్ణి చివరి క్షణాల్లో కూడా చిత్రహింస చేస్తున్నావ్. (ఆమెను

రెండుచేతుల్తో పట్టుకు కుదుపుతూ) రాధా! ఏమిటా విషయం ? చెప్పితీరాలి నువ్వు -

రాధ : అయిదేళ్ళక్రితం నువ్వు యింటికి వచ్చినప్పుడు జరిగిన సంఘటన యింకా ఆయన మనస్సులో ఉన్నట్టున్నాయి.

శేషు : ఏం జరిగిందప్పుడు ?

రాధ : (ఏడుస్తూ) నా నోటంట చెప్పించకు బావా ! నీకు నమస్కారం చేస్తాను.

శేషు : (కరుకుదేరి) కాదు రాధా! చెప్పి తీరాలి - వాడి కోసం మన వ్యక్తిత్వాన్ని, కోరికల్ని, చివరికి మన ప్రాణాల్నయినా వదులుకోవాలి. చెప్పు. ఆ విషయం ఏమిటో ?—

రాధ : (గుండె దిటవు చేసుకుని) ఆయన అనారోగ్యం, ఎప్పుడూ పుస్తకాలు చదవటం, పొలం పాడవడం— యివన్నీ నన్ను బాధపెట్టాయి. ఆయన మీద విరక్తి కలిగింది - ఉదాసీనతతో, ఆవేశంతో ఆనాడు ఏదో అరిచాను;

శేషు : ఏమని ?

రాధ : నన్ను క్షమించు బావా ?

శేషు : కాదు చెప్పితీరాలి.

రాధ : నీమీద నాకు అభిమానమనీ, తన ముఖం చూడడానికే అసహ్యమనీ - యిలాగా—

శేషు : (నిశ్చేష్టుడయి) రాధా !

రాధ : అవును బావా ! ఆ కోపంలో గుండె రగిలింది. దుఃఖం కట్లు తెగింది.

శేషు : ఎంతపని చేశావు రాధా ! ఈ అనుమానాలన్నీ వాడిలో పనిచేసి ఉంటాయి. ఇన్నాళ్ళూ ఇది మనస్సులో ఉంచుకు క్రుంగిపోయి వుంటాడు.

రాధ : నేనేం చెయ్యను ? ఇన్నేళ్ళూ నోరుమూసుకు పడి ఉండడం నేర్చుకున్నాను. కాని ఆనాడు ఆగలేక పోయాను.

శేషు : కాని, వాడు నిన్నెంత ప్రేమిస్తున్నాడో తెలుసా ?

రాధ : తెల్సు. నేనంటే అభిమానం—

శేషు : (కోపంతో) అభిమానం. హుఁ. ఏం మనిషివి నువ్వు. మాట్లాడకుండా ఉండలేక పోయేవ్ ? వాణ్ని సర్వనాశనం చేయాలనుకున్నావ్ నువ్వు. ఇప్పుడిలా రోగంతో, బాధతో, చస్తున్నాడంటే అన్నిటికీ నువ్వే కారణం. ఈస్పర్ధలతో, ఈ దురభిప్రాయాల్తో ఇన్నేళ్ళు బ్రతికారా మీరు ! ఛీ ! ఏం బ్రతుకులు మీవి ?

రాధ : బావా !

శేషు : అయితే వాడింకా ఆ అభిప్రాయంలోనే...

రాధ : ఏమో తెలీదు.

శేషు : తెలీకపోవడం నాకు. నీకంతా తెల్సు. తెలిసీ వాడి నలా నాశనం చేశావ్. నిజానికి నువ్వు నన్ను ప్రేమి స్తున్నావు.

రాధ : (నివ్వెరపోయింది) బావా!

శేషు : అవును. నేనే అంటాను. నువ్వు నన్ను ప్రేమిస్తు న్నావ్... ప్రేమిస్తున్నావ్...

రాధ : (కోపం కట్లు తెగింది) ప్రేమిస్తున్నానా నిన్ను?–అవును. నిన్ను ప్రేమించకపోతే యింక నాకు గతి ఏముంది?– నీలో ఏం చూసి ప్రేమించాలి నేను? నీ డబ్బుని చూశా? నీ హోదాని చూశా? మీ కుటుంబానికి యిదో మదం ఉంది. అంతా మీ వెంట పడ్తారనీ, మీరులేకపోతే ఎదుటివాళ్ళు బ్రతకలేరనీను. నేను కాదు. ఆ గర్వమే మిమ్మల్ని తినేస్తోంది? – (Gap) నిన్ను ప్రేమించానా—(విరామం)... బావా!— నా ఆనందం పోయింది, సుఖం పోయింది, కాని నా వ్యక్తిత్వం పోలేదు. దానికోసమే గర్వంతో బ్రతుకుతున్నాను యిన్నాళ్లూను. నీనోటికి వచ్చినట్లు మాట్లాడి తెలివితక్కువవాడివి కాకు. మనసా, వాచా ఆయన్ని మొదట ఎంచుకున్నాను. నావ్యక్తిత్వం కోసం, నిజాయితీకోసం, నా మనస్సుకోసం, ఏ కష్టా న్నయినా సహిస్తాను. అంతేకాని యిలాంటి నీచ మయిన అభిప్రాయాల్తో కుక్కబ్రతుకు బ్రతకను. మరోసారి చెప్తున్నాను — నిన్ను ప్రేమించలేదు,

ప్రేమించలేదు. ప్రేమించను. ప్రేమించానని అనుకోవడం సిగ్గుచేటు ... (టేబిలుమీద ముఖం ఆనించుకుని దుఃఖం ఆపుకోలేక భోరున ఏడ్చేసింది.)

(శిలయిపోయాడు శేషు. ఇక్కడొక ఘట్టం వీళ్ళిద్దరికీ తెలీకుండానే జరిగిపోయింది. రాధ యీ మాటలు చెప్పేసమయంలో రఘూ ఆమె గొంతువిని గుమ్మందగ్గరకువచ్చి ఆనుకునినిలబడ్డాడు. మాటలన్నీ విన్నాడు. సంవత్సరాలుగా తనలో ఉండిపోయిన సమస్య ఆ క్షణంలో తీరిపోయినట్టు ముఖంలో తృప్తి కనిపించింది. రాధమాటలు పూర్తయేలోగానే దగ్గుతెర ముంచుకు వచ్చేసరికి నోటికి చెయ్యి అడ్డంగా ఉంచుకుని అక్కడే నేలన కూచొని తల కుర్చీకి ఆనించుకున్నాడు. చేతిలో రక్తం కన్పించేసరికి కళ్ళు బైర్లు కమ్మాయి. లాల్చీకి తుడుచుకున్నాడు. ఎగశ్వాస వస్తోంది. కను రెప్పలు బరువెక్కుతున్నాయి. కుర్చీచెయ్యికి నీరసంగా తల ఆనించాడు. తల క్షణక్షణానికి బరువెక్కుతున్నట్టుంది.)

(ఈతనిని రాధ, శేషు గమనించనేలేదు.)

శేషు : రాధా!

రాధ : మీరంతా నన్నిలా మాటల్తో చంపేశారు.

శేషు : (పశ్చాత్తాపంతో) రాధా!

రాధ : (ఒక్కసారిగా తలవంచుకుని ఆవేశం తగ్గించుకొంది) క్షమించు బావా! – ఇప్పుడు ఆవేశాలకి పోవడంవల్ల ఎవరికీ లాభంలేదు. ఇప్పుడు మనం చేయగలిగిందల్లా ఆయన మనస్సుకి శాంతికల్గించడం.

శేషు : (తేరుకుని) అవును రాధా! అందుకు ఒక్కటేమార్గం.

రాధ : (తలెత్తి చూసింది)

శేషు : మంచికో, చెడుకో వాడిలో యింకా అప్పటి దురభిప్రాయం ఉండిపోయింది. నువ్వు వెళ్ళు. వెళ్ళి నిజం

చెప్పు. ఊరికే ఆనాడు ఏదో అరిచానని చెప్పు. ఏదైనా చెప్పు. కాని వాడు మాత్రం నమ్మేట్టు చెయ్.

రాధ : (నిశ్చలంగా) నా మాట నమ్మరాయన.

శేషు : నమ్మేట్లు చెప్పాలి. తెల్సిందా? - చెప్పి తీరాలి. తొందరగా వెళ్ళు. అంతా అయిపోయాక విచారించి లాభంలేదు.(ఆమె యింకా తటపటాయిస్తూంటుంది.) రాధా! ఏమిటాలోచిస్తున్నావ్? వాడికి ఋణపడి ఉన్నాననిపించడంలేదూ నీకు? రాధా! వెళ్ళు. రాధా!- యిప్పుడీపని చెయ్యకపోతే జీవితాంతం నీ మనస్సుకి శాంతి ఉండదు.

రాధ : అవును. వెళ్తాను. కాని చెప్పినందువల్ల లాభం ఉండదు. నాకు తెల్సు.(ఆగి వెనక్కి తిరిగిచూస్తూంది ) కుర్చీని ఆనుకుని సంవత్సరం తర్వాత మళ్ళీ ప్రశాంతంగా ఉన్న రఘూ ముఖం చూసింది. ఒక్కసారి శరీరం యావత్తూ కంపించింది. శేషుని నిస్సహాయంగా చూసింది. మళ్ళీ రఘూవేపు కదిలింది. కూచుని వణికేచేతిని భుజంమీద ఆనించి కంపిత స్వరంతో "ఏమండీ" అనబోయింది. ఆధారం తప్పిన తేలిక శరీరం, ఆమె వొళ్ళోకి జారిపోయింది. భయమేసి గుండెమీద తల ఆనించింది, ఒక్కసారిగా 'బావా!' అని అరచి రఘూ శిరస్సును హృదయానికి హత్తుకొంది. కన్నా, శేషూ నిర్విణ్ణులయారు.)

వెనుక దూరంగా వేయిగొంతులు—నీరవమైన నిశీథి, నిశ్శబ్దాన్ని రెండుగా చీలుస్తూ—

ప్రియతమా! ప్రియతమా!
పిలుపు చేరగలేదె!
మముదాటి పోయేటి
మమత నీకేల నిక ?
మరలి రమ్మ్రంటు మనసు,
మరులు గొలిపెడ మేను...

— తెర —

—•—